# వ్యాస సూక్తం

రచన

డా॥ కె. కమల

ప్రచురణ




రిజిష్టర్డు నెం. 1/64

యువభారతి
సాహితీ సాంస్కృతిక సంస్థ
5 కింగ్స్‌వే, సికిందరాబాదు-3

VYASA SOOKTHAM - BHAGAVAN VEDAVYASA'S
Selected Verses With Commentary By Dr. K. KAMALA.



ప్రచురణ సంఖ్య : 109

ప్రథమ ముద్రణ:
డిశంబర్ 7, 1984

ప్రతులు : 3,200
ముఖ చిత్రము : శ్రీ శీలా వీర్రాజు

ముద్రణ :

ఎ. యస్. ఆర్ట్ ప్రింటర్స్,
లక్‌నగర్, న్యూనల్లకుంట, హైదరాబాద్.

ముఖచిత్ర ముద్రణ :

బాలాజీ ఆర్ట్ ప్రింటర్స్,
చిక్కడపల్లి, హైదరాబాద్.

ప్రతులకు :

యువభారతి

5, కింగ్స్ వే,
సికింద్రాబాద్ - 500 003

లేదా

యువభారతి కార్యాలయం
ఆంధ్ర సారస్వత పరిషత్ భవనము
తిలక్ రోడ్, హైదరాబాదు-500 001

వెల : రూ. 5/-




# యువభారతి పరిచయం

ఉత్తమ సాహిత్యాధ్యయనంవల్ల సమగ్రత చేకూరుతుంది. సమాజంలో సామరస్యం పెంపొందుతుంది. ఉత్తమ భావ ప్రసరణానికి పుస్తకాలు చక్కని సాధనాలు. అందరికీ అందుబాటులో ఉండే విధంగా, మంచి పుస్తకాలను అందించే ప్రయత్నానికి యువభారతి పూనుకొని, గడచిన ఇరవై ఏళ్ళుగా, పాత కొత్తల మేలు కలయికను ప్రాతిపదికగా పెట్టుకొని, నూటెనిమిది పుస్తకాలను ప్రచురించింది. ఉపన్యాసమంజరి కార్యక్రమాలను, సదస్సులను నిర్వహించింది.

సహృదయుల సహకారంతో, పుస్తకాల అమ్మకంవల్ల వస్తున్న ద్రవ్యంతో, పుస్తకాలను ప్రచురిస్తూ తక్కువ వెలకు ఎక్కువ విలువ వున్న సాహిత్యాన్ని అందించడానికి యువభారతి ఉద్యమిస్తున్నది. ఉత్తమ సాహిత్య ప్రచారాన్ని ధ్యేయంగా పెట్టుకొని ప్రచురణలను వెలువరిస్తున్నదేకాని, మా సంస్థ వ్యాపారసంస్థ కాదు.

భారతదేశంలో ఎక్కడ ఉన్నా సరే! యువభారతి నిర్వహిస్తున్న సాహిత్యోద్యమంలో పాలుపంచుకొనేందుకు ప్రారంభింపబడిన సాహితీ మిత్ర పథకంలో 8500 మంది సభ్యులుగాచేరి ప్రణాళికను విజయవంతం చేసినారు. యువభారతి భవిష్యన్నిర్మాణంలో సహకరించేందుకు ప్రారంభింపబడిన సభ్యత్వ పథకాలలో భారతీమిత్రులుగా 1200 మంది, భారతీభూషణులుగా 125 మంది చేరారు.

సహృదయుల సహకారాన్ని అర్థిస్తూ

హైదరాబాద్ డా॥ ఇరివెంటి కృష్ణమూర్తి

డిశంబర్ 7, 1984. అధ్యక్షులు



# మామాట

వ్యాససాహితి అందించిన విజ్ఞానంతో పరిచయం లేనివాడు భారతీయతతోనే పరిచయం లేనివాడు. వ్యాససాహితి విజ్ఞాన సర్వస్వం. భారతీయుల ఆలోచనలన్నీ, కార్యకలాపాలన్నీ, ఆదర్శాలన్నీ ప్రత్యక్షంగానో, పరోక్షంగానో వ్యాసప్రజ్ఞాపేతములే. దేశకాల పాత్రోచిత పరివర్తనలకు అనుగుణంగా ఆ ప్రతిభాశాలి అందించిన భావసంపద అనంతరూపాలతో సాక్షాత్కరిస్తూ ఉంటుంది. ఆయన వ్రాసిన మహాభారతేతిహాసం, అష్టాదశపురాణాలూ, అష్టాదశ ఉపపురాణాలు, బ్రహ్మసూత్ర భాష్యాలూ మానవజీవితానికి సంబంధించిన సర్వవిషయాలనూ పరామర్శించినవి. వ్యాసుని రచనలు పఠితలలో దేశభక్తిని ఉద్దీప్తం చేస్తాయి. ఈ రోజులలో అంతకంటే కావలసినదేమున్నది? 'సర్వభారత ప్రజలు నా సోదరులు' అన్న భావానికి ప్రాచుర్యం కలగాలంటే వ్యాససాహితీ ప్రసరణం అందుకు సమధికంగా తోడ్పడుతుంది.

వ్యాససాహితి ఒక మహాసాగరం. రత్నాలవంటి సూక్తుల కది గని. రత్న కాంతి ఎన్నడూ ఉడిగిపోనిది. ఆయన సుధాకరంలోనుంచి కొన్ని శ్లోకాలను ఏరుకుని వాటికి సరళమైన తెలుగులో వ్యాఖ్యానం వ్రాసి ఇయ్యవలసినదిగా మేము డాక్టర్ కె. కమలగారిని కోరినాము. ఆమెది పండిత వంశం. సంస్కృత భాషను ఆమె బాల్యంలోనే తెలుగుతోపాటు అలవరచుకున్నారు. 'ఆంధ్రభిల్హణ' బిరుదాంచితులు, బహుభాషావేత్తలు, కీర్తిశేషులు శ్రీ కప్పగంతుల లక్ష్మణశాస్త్రిగారి కూతురామె. 'ప్రాకృత కావ్యాలలో సాంఘిక జీవితవృత్తం' అన్న అంశంపై పరిశోధనచేసి, ఉస్మానియా విశ్వవిద్యాలయం వారి పి.హెచ్.డి. పట్టాను ఆమె సంపాదించినారు. తెలుగు సంస్కృత భాషలలోని వాఙ్మయాలను [illegible]గా పరిశీలించినారు. నిజాం కళాశాలలో సంస్కృతశాఖలో ఆమె ఇప్పుడు రీడరు పదవియందున్నారు.

యువభారతి నిర్వహిస్తున్న సాహిత్యోద్యమాన్ని ప్రోత్సహిస్తున్న విదుషీమణి ఆమె. అభ్యర్థనను మన్నించి ఈ 'వ్యాససూక్తం' వ్రాసి మాకు అందించి ప్రచురించుకునే అవకాశం కల్పించిన డాక్టర్ కె. కమలగారి ఔదార్యానికీ, సాహిత్యోద్యమాసక్తికీ, మా అభినందనములు, ధన్యవాదములు.

—ఇరివెంటి కృష్ణమూర్తి

# వ్యాససూక్తము

శుక్లాంబరధరం విష్ణుం శశివర్ణం చతుర్భుజమ్,
ప్రసన్నవదనం ధ్యాయే సర్వవిఘ్నోపశాంతయే.

వ్యాసం వసిష్ఠ నప్తారం శక్తేః పౌత్రమకల్మషమ్,
పరాశరాత్మజం వందే శుకతాతం తపోనిధిమ్.

వ్యాసాయ విష్ణురూపాయ వ్యాసరూపాయ విష్ణవే
నమో వై బ్రహ్మనిధయే వాసిష్ఠాయ నమో నమః

అవికారాయ శుద్ధాయ నిత్యాయ పరమాత్మనే
సదైక రూపరూపాయ విష్ణవే ప్రభవిష్ణవే

యస్య స్మరణమాత్రేణ జన్మసంసార బంధనాత్
విముచ్యతే నమస్తస్మై విష్ణవే సర్వజిష్ణవే

అచతుర్వదనో బ్రహ్మ ద్విబాహురపరో హరిః
అఫాలలోచనః శంభుర్భగవాన్ బాదరాయణః

నారాయణుడు, అతని నాభికమలమునుండి జన్మించిన బ్రహ్మ, బ్రహ్మ మానసపుత్రుడు వసిష్ఠుడు, వసిష్ఠుని సంతానము, శక్తి, శక్తిమహర్షి పుత్రుడు పరాశరుడు. పరాశరాత్మజుడు వ్యాసుడు, అతని కొడుకు పరమ భాగవతోత్తము డయిన శుకుడు, ఆపరంపరలో గౌడపదాచార్యులు, గోవిందయోగి తదితరులు. మనకు గురువులు. ఇది ఆర్షగురు పరంపర. వీరిలో వ్యాసమహర్షి సాక్షాత్ విష్ణు రూపుడే, అతనికి నాలుగు ముఖములు లేవు, కాని బ్రహ్మసమానుడే, రెండే రెండు బాహువులున్న విష్ణువతడు. నుదుట మూడవ కన్నులేని శివుడు. త్రిమూర్తి స్వరూపు డయిన వ్యాసభగవానునకు బాదరాయణుడు, కృష్ణద్వైపాయనుడు అని కూడా పేర్లున్నవి అనంతముగానున్న వేదవాఙ్మయాన్ని ఋగ్, యజుస్, సామ, అథర్వణ వేదములనే పేరట నాల్గుభాగాలుగా విభజించినందుకు తనయనకు

వేదవ్యాసుడనే బిరుదమువచ్చింది. సమాసమంటే సంగ్రహించి క్లుప్తముగా చెప్పడం, వ్యాసము అంటే విస్తరింపజేసి వివరణము చేయడమూ అని అర్థము. సముద్రమంత గంభీరము. ఆకాశమంతటి ఉన్నతము. ధర్మమంతటి సూక్ష్మము అయిన ఈ భారతీయ సంస్కృతిని విస్తరింపజేసి. పండిత పామరులకు అంద జేసిన వాడు వ్యాసభగవానుడు. వ్యాసుడు ఒక వ్యక్తి పేరుకాదు. అతడు ఒక సంస్థ అని విమర్శకుల అభిప్రాయము. మానవమాత్రుడు తన జీవితకాలములో సాధించలేనంత వాఙ్మయాన్ని సృష్టించిన వ్యాసుడిని గూర్చి అట్లా భావించడంలో అబ్బురమేమున్నది? వ్యాసుడు చిరంజీవి అని అంటారు. వ్యాసపీఠము బుద్ధికి ప్రతీక అయినప్పుడు వ్యాసుడు చిరంజీవి కాకుండు టెట్లు? ఎక్కడెక్కడ చర్చలు. ఉపదేశములు, ప్రవచనాలు, జరుగుతూఉంటవో, ఎక్కడ ఆలోచనామృతాన్ని పంచుతూ ఉంటారో, అక్కడ వ్యాసుడు అదృశ్యరూపంలో తిరుగుతూనే ఉంటా డని ప్రతీతి. కాబట్టి మనమే చర్చసాగిస్తూ ఉన్నా అతనికి భయపడక తప్పదు. వ్యాసుడెవరు? మన అంతర్యామియే అతడు. ప్రతి ఒక్కరి వ్యక్తిత్వములో భాగమయి మార్గదర్శి అయిన జ్యోతి ఈవ్యాస తత్త్వము. ఒక్క నిమిషకాలము వ్యాసుడు లేని భారతీయ సాహిత్యాన్ని మనమూహించుకుంటే అది శూన్యముగా కనిపిస్తుంది. బ్రహ్మసూత్రాలు, పంచమ వేదమయిన భారతము, అష్టాదశ పురాణాలు, మహాపురాణాలు, అతిపురాణాలు, ఉపపురాణాలు, హరివంశము ఇన్నింటి కర్త వ్యాసుడు, భారతము ఒక్కటే లక్షశ్లోకముల సంహిత. దానికి ఖిలము (Supplement) అనదగిన హరివంశము ఇరువది నాల్గువేల గ్రంథము, ఇవి రెండూ కలిసి సవాలక్ష గ్రంథమయినది అందుకే తెలుగుభాషలో చాలా పెద్ద ముచ్చటను సవాలక్ష గ్రంథమని వ్యవహరించడము పరిపాటి. ఈ ఒక్క గ్రంథమే ప్రపంచములోని అన్ని గ్రంథములలో పెద్దది.

వ్యాసమహర్షి పరమకారుణికుడు మానవతపై గల అపార దయాభావముతో "మంచి అన్నది. పెంచుమన్నా" అని ఉపదేశించినాడు. ఆ ఋషి ప్రోక్తములైన గ్రంథములేవి తెరిచి చూచినప్పటికినీ ఆ మహర్షి చిరునవ్వుతో, బవిరిగడ్డముతో, చామనచాయతో, జ్యోతులవలె ప్రకాశించే కండ్లతో సాక్షాత్కరిస్తాడు. నాయనలారా ఈ మార్గాన్ని అనుసరించండి, అని మిత్రసమ్మితముగా ఉపదేశిస్తాడు. అయితే ఆ ఉపదేశాలను మనము నమ్మడమెట్లా? వ్యాసుని వాక్కులో సత్యమెంత వరకు

ఉన్నది అని ప్రశ్నించవచ్చును. దాని కొకటే సమాధానము. అబద్ధాలు చెప్పి మనలను నమ్మించడము వలన ఆయనకొచ్చే లాభమేమి? ఆయన స్వార్థముతో ఏదైనా చెప్పిఉంటే, నేటివరకెప్పుడో కాల గర్భములో కలిసిపోయేవి ఆ రచనలు. కాలమనే ఒరిపిడిరాయి మీద రాచి చూచినప్పుడు ఈ రచనలు పదహారణాల వంతు బంగారమేనని ప్రపంచమంతా ఒప్పుకున్నట్లే, బైబిలు వంటి గ్రంథము త్రికాలాబాధ్యములైన సత్యాలను ప్రబోధించినప్పుడు వ్యాసుడు పాడిన ప్రబోధగీతము అంత స్వచ్ఛము మధురమేనని తోస్తుంది. పాశ్చాత్య విమర్శకుడొకడు. భగవద్గీతను చదివినప్పుడు పొందిన అనుభూతిని గమనించండి; "నేడు భగవద్గీత అనే గ్రంథమును చదివితిని నేటి వరకు నా కాయుష్యము నొసగినందులకు పరాత్పరునికి నేనెంతయు ఋణపడిఉన్నాను. ఒకవేళ నేను నిన్న మరణించిఉంటే ఈ గ్రంథము చదివే భాగ్యము నాకు లేకపోయెడిది కదా!'' అని "క్రీ.శ. 1785 సంవత్సరములో భగవద్గీతను. ఛార్లెస్ విల్‌కిన్స్ అనే ఆంగ్లేయుడు బ్రిటిషు ఇండియా కంపెనీ వారి అధిపతి అయిన వారెన్ హేస్టింగ్స్ పనుపున ఇంగ్లీషులో కనువదించెను. నేరుగా సంస్కృతమునుండి యూరోపు భాషలోనికి అనువాదమయిన తొలి గ్రంథమిదే. అంతకు పూర్వము పంచతంత్రము ఉపనిషత్తులు పర్షియన్ అనువాదము ద్వారా యూరోపును చేరుకున్నవే. భగవద్గీత అనువాదము వలన ప్రపంచ సాహిత్యములో, దర్శనములో ఈ గ్రంథమునకు శాశ్వతస్థానమున్నట్లు విశ్వమంతటను వెల్లడి అయింది.

మన ఆలోచనా సరణిని మలచిన శిల్పి వ్యాసుడు. మనకై ఎన్నో విషయాలను తనే ఆలోచించినాడు. అందుకే వ్యాసప్రోక్తము కాని కొత్త ఆలోచనలు మనకు రావడము కష్టము. ఇతడు ఆస్తికులలో ఆస్తికుడు, హేతువాదులలో హేతువాది. ధార్మికులలో పరమధార్మికుడు, కవులలో క్రాంత దర్శనము గల ఉత్తమకవి. సాంఘిక శాస్త్రవేత్తలకు ఈతని గ్రంథములు పెన్నిధివంటివి. అందుకే "వ్యాసోచ్ఛిష్టం జగత్సర్వమ్" అనేనానుడి ప్రచారములోనికి వచ్చింది. ఈ జగత్తంతా వ్యాసుడు వర్ణించి వదిలి పెట్టిందేనని తాత్పర్యము. ధ్వనికారుడు కవులంటే వ్యాసుడు, వాల్మీకి ఈ ఉభయుల పేర్లనే గ్రహించవలెనని. కాళిదాసాదులు గూడా వారి తరువాత వారేనని ముక్తకంఠముతో చెప్పెను. వ్యాసుని రచనలలో కథలు, పొడి సుభాషితాలేనా, కవిత్వమేమైనా ఉన్నదా అని ప్రశ్నవేస్తే ఉపదేశమే

ప్రయోజనముగా పెట్టుకొని సాగించిన రచనలవి అని చెప్పాలి. కవితా వైభవము శిల్పము, వ్యంగ్య వైచిత్రి, అక్షరరమ్యత, అలంకార సౌష్టవము, ఇవన్నీ ఇచ్చట గౌణములు. చూడండి భగవద్గీతలోని ఒక ఉదాహరణము:

"యదాసంహరతే చాయం కూర్మోఽంగా నీవ సర్వశః,
ఇంద్రియాణీంద్రియార్థేభ్యస్తస్య ప్రజ్ఞాపతిష్ఠితా :

ఎవరు ఇంద్రియములను తమ అదుపులో ఉంచుకోవడానికి ప్రయత్నిస్తారో వారు తాబేలు వలె వ్యవహరించాలి. ఏదైన దెబ్బపడ్డప్పుడు, ప్రమాదము సంభవించినప్పుడు తాబేలు తన అంగములను చిప్పలోనికి ముడుచుకొని తనను తాను రక్షించుకుంటుంది. అట్లాగే బాహ్యప్రపంచములోని ఆకర్షణలు ఎక్కువైనప్పుడు. అతి ప్రమాదస్థితి అని గ్రహించిన, మనిషి తన వ్యక్తిత్వానికి, కర్మయోగానికిదెబ్బ అని తెలిసికొని తాను సాధించదలచిన ధ్యేయము కొరకు ఇంద్రియాలను కళ్ళెము వదిలివేసిన గుఱ్ఱాలవలె, పరుగెత్తనీయక తాబేలువలె తనలోనికి సంహరించు కొనవలెను అనగా ముడుచుకొనవలెను. అట్టివాడు స్థితప్రజ్ఞుడు. ఒక వ్యాసము వ్రాయడానికే ఇట్టి ప్రయత్నమవసరమయి నప్పుడు జ్ఞానికి, తాత్వికునికి, కర్మయోగికి వీని ఆవసరమింతింత యని చెప్పనక్కరలేదు. ఇక్కడ తాబేలుతో చేసిన సాదృశ్యము కవితాశిల్పము ను దృష్టిలో ఉంచుకొని చేసింది కాదు. ఉపదేశమే అక్కడ ప్రధానము. ఇది వ్యాసహృదయము. అయితే ఋతువర్ణనాలలో కథాసంవిధానములో తనకు తానే సాటి అనిపించే సామర్థ్యము చూపిన్నవాడితడు. లక్షణావ్యంజనా వ్యాపారములచ్చటచ్చట గృధ్రగోమాయు సంవాదము వంటి వృత్తాంతములలో తొంగిచూచినప్పటికిని ఈయన కవిత అభిధామూలము. తాను నిర్వర్తింపజేయదలచుకున్న ప్రయోజనమునకు అభిదవల్లనే ఎక్కువ ఉపయోగము.

"ఇతిహాస పురాణాభ్యాం వేదం సముపబృంహయేత్" అనే అభియుక్తోక్తి ఒకటున్నది. ఇతిహాస పురాణముల ద్వారా వేదమును తెలుసుకోవాలి. పుష్టముగా చేసికోవాలి, ఉపబృంహణము చేయాలి అనికదా అర్థము. వ్యాసకృతులు వేదము వలెనే ఉంటాయి. అందులోనూ భారతములో యక్షప్రశ్నలు, సావిత్రికథ, నలదమయంతుల కథ, సుపర్ణాఖ్యానము, ఇవన్నీ వైదిక దేవతలను, ఇంద్రాగ్ని

యమవరుణాదులను స్తుతించేవే. అందులోనూ సావిత్రికథ కొక ప్రముఖస్థాన మున్నది. యమధర్మరాజుతో ధర్మచర్చను సాగించిన బ్రహ్మవాదిని సావిత్రి, సత్యవంతుని ప్రాణాలనామె తన వైదుష్యముతో, స్థైర్యముతో తపస్సుతో, పాతి వ్రత్యముతో, స్నేహశీలతతో గెలుచుకున్నది. పోనీపాపము అని యముడామెకు పతిభిక్ష పెట్టలేదు. ఇక్కడ యముడు, సావిత్రి ఇద్దరును జ్ఞానానికి, ప్రకాశానికి, ప్రతీక అయిన సూర్యభగవానుని అంశసంభూతులే, సవిత అంటే సూర్యుడు. ఆ అంశలో పుట్టింది సావిత్రి, వివస్వాన్ అంటే కూడా సూర్యుడనే అర్థము. అతని అంశవల్ల పుట్టినవాడే వైవస్వతుడయిన యమధర్మరాజు. మారిస్ వింటర్ నిట్జ్ అనే జర్మన్ విద్వాంసుడు భారతీయ సాహిత్య చరిత్ర (History of Indian Literature) లో సావిత్రిని గూర్చి చెప్పిన మాటలు అమృత గుళికలు చూడండి;

"But whoever it was who sang the song of Savitri, whether a suta or a Brahman, he was certainly one of the greatest poets of all times. Only a great poet was capable of placing this noble female character before us so that we seem to see her before our eyes. Only a ture poet could have described in such a touching and elevating manner the Victory of love and constancy of virtue and wisdom, over destiny and death without even for an instant falling into the tone of day preacher of morality.)

(ఈ సావిత్రీకావ్యరచన చేసినవాడు సూతుడో బ్రాహ్మణుడోగాని, అన్ని కాలాలలో దేశాలలో అంతటి కవిలేడని అతడే ఉత్తమోత్తమకవి అని చెప్పవచ్చును. అంతటి కవికాబట్టే అతడు సావిత్రిని మనకన్నుల ఎదుట ప్రత్యక్షము గావించెను. ప్రేమ, పాతివ్రత్యము సౌశీల్యము, జ్ఞానము అనే ఈ గుణములలో ఆమె విధిని మృత్యువును జయించిన తీరును. ఇంత గంభీరముగా హృదయమును స్పృశించు నట్లు వర్ణించగలిగినవాడు చాలాగొప్పకవి. అయినా అతడెక్కడనూ శుష్క ప్రవచన ములను ఈ కావ్యములో చేయలేదు).

వ్యాసుడు చెప్పిందంతా ఈ విధంగా వేదమే అవుతుంది. కావ్యమే అవు తుంది. ధర్మశాస్త్రమే, సుభాషితమే అవుతుంది. సుభాషితము, సూక్తము అంటే నీతి బోధయే కానక్కరలేదు. అందమైన ఉక్తి సూక్తి సుభాషితము. అట్లయితే వ్యాసుడు చెప్పినదంతా సూక్తమే. వ్యాససూక్తాన్ని ఈ చిన్నగ్రంథములో పొదిగి వ్యాస హృదయాన్ని సాక్షాత్కరింపజేయడం సాహసమే-అయినా అధికారి

యోగ్యతను బట్టి గ్రంథము విలువ ఉంటుందికాని మూలగ్రంథకారునికి చెప్పడానికి వస్తువులో లోటేమీలేదు. వ్యాససాగరాన్ని ఈ చిన్నకుండలో నింపాలనుకుంటున్నాను. ఆ సాహసాన్ని నాకు కలిగింపజేసిన వారు "యువభారతి" సంస్థ.

దాక్షిణాత్యులకు, అందులోనూ ముఖ్యముగా తెనుగువారికి వ్యాసుడు సన్నిహితుడు. దేశభాషలలోనికి మహాభారతానువాదములు జరిగినప్పుడు అందులో ఆంధ్రానువాదమే తొలియత్నము. కాబట్టి ఆంధ్రులందుకు గర్వపడవచ్చును. ఇతర పురాణముల అనువాదములట్లుండనిండు. మనకు వ్యాసహృదయాన్ని సాక్షాత్కరింపజేసిన మహనీయులు కవిత్రయమూ, పోతనామాత్యుడు. సంస్కృత భాషలో భాసమహాకవి మొదలుకొని భారతము నాధారముగా రచనలు సాగించిన వారు కోకొల్లలు, భాసుడు ఆరు భారతనాటకములకు కర్త. అభిజ్ఞానశాకుంతలము, వేణీసంహారము వంటి నాటకములు విశ్వవిఖ్యాతములయినవి ఉండనే ఉన్నవి. వ్యాసుడు ప్రాచీనకాలములోనే భారతీయులకేగాక ఆగ్నేయాసియాప్రాంత వాసులందరకునూ శ్రద్ధేయుడయినాడు. భారతీయ సంస్కృతిలో భాగముగా భారత సంస్కృతి, భాగవత సంస్కృతి ఈ దేశాలలో విస్తరించింది. అట్టి వ్యాసుడెంత మహోన్నతవ్యక్తియో, అతని రచనలను మనమింకా పదేపదే చదవవలసిన అవసరమెందుకున్నదో, తెలుసుకొవడానికీ పుస్తకము తోడ్పడితే ధన్యురాలను. కాళిదాస మహాకవి "పురాణమిత్యేవ న సాధు సర్వం, న చాపి కావ్యం నవమిత్యవద్యమ్" అని చెప్పెనుకదా (పాతది అంతాసాధువు కొత్తకావ్యము రోత అనుకోవడం తప్పు) ఇప్పుడు ఆ పాతలో ఎంత నిత్యనూత్నత్వము, కొత్తదనము ఇమిడి ఉన్నదో యాంత్రిక యుగములో ఉన్నమానవునికి గూడా, ఈ పాత ఎందుకవసరమో తెలుసుకోవడానికే ఈ ప్రయత్నము "పిపాసితైః కావ్యరసో న పీయతే (కావ్య రసాన్ని పానం చేయడంతో దప్పిక తీరుతుందా) అన్నది పాతమాట. ఆకలి దప్పులు తీరినంతమాత్రాన, సంక్షేమ పథకాలను అమలు చేసినంతమాత్రాన, పేదవారికి ఇండ్లు కట్టించి ఇచ్చినంతమాత్రాన మానవుని సమస్యలు తీరవు. అతడు మానసికంగా తృప్తిని పొందలేడు. ఈ కట్టించిన ఇండ్లను ఎదుటివాడు ధ్వంసము చేయకుండా ఉండాలంటే, పంట చేలకు నిప్పు ముట్టించకుండా ఉండాలంటే, త్రాగేనీటిలో విషముకలుపకుండా ఉండాలంటే మనిషిలో మంచి అన్నది పెరగాలి హృదయము సంస్కారముతో పరిపక్వము కావాలి, అందుకు దోహదము చేస్తేదే

వ్యాస సాహితీ సంహిత. ఇది చదువులలో సారము. మూలము చదివి కొంతవర కైనా తాత్పర్యాన్ని ఆకళింపు చేసుకోవడానికి కొంచెము సంస్కృత భాషాజ్ఞానము బోలెడంత సహృదయత్వము సంస్కారము ఉండాలి. అది పెంపొందింపజేసి కొమ్మని యువభారతి ముఖంగా పాఠకులనభ్యర్థిస్తున్నాను. భారత, భాగవత, రామాయణాలకు సాటివచ్చే రచనలు బహుశ గ్రీకు సాహిత్యములో ఉన్నవేమో గాని కావ్యనాయికా నాయకులను, సీతారామాదులను, కథారథసారథులైన శ్రీ కృష్ణాదులను గుండెలో, వీధిలో, గుడికట్టుకొని పూజించే భాగ్యము భారతీయులకే దక్కింది. గ్రీకు ఎపిక్ గ్రంథాలు ఇలియడ్ ఒడిస్సీల వంటి వానిలో నాయకులు వారికి దేవతలుకారు. మానవత్వముతో దివ్యత్వాన్ని సాధించిన మధుర సన్నివేశమీ భారతీయ సాహిత్యము భారతకథలో శ్రీ కృష్ణుడు నాయకుడు కాకున్నా అది నారాయణ కథయే. భారతము, మహాభారతము, జయము అనే పేరట ప్రసిద్ధ మయింది భారతేతిహాసము, శాంతరస ప్రధానముయిన ఇతిహాసమిది. ప్రధానంగా భారతం నుండి, కొంత భాగవతం నుండి సూక్తులను ఏర్చికూర్చి నాను. ఆదరించండి.

## భగవద్గీత

మనమిదివరలో చెప్పుకున్నట్లు భగవద్గీతను మించిన గ్రంథము మరొకటి లేదు. వ్యాససాహిత్యసాగరములో గీతల సంఖ్య పెద్దది. శాంతిపర్వములోనే పరాశరగీత. మంకిగీత.హంసగీత. ఋషభగీత.శంపాకగీత. బోధ్యగీత విచఖ్నుగీత అహింసాప్రశస్తి. హారీతగీత. వృత్రగీత, అనే గీతలు చాలా ఉన్నవి. ఇవిగాక గోపికాగీత. భ్రమరగీత, ఉద్ధవగీత, శృతిగీతాదులు ప్రసిద్ధములు. ఈ గీతలన్నింటిసారము భగవద్గీత. భగవద్గీతఉపనిషత్తులలోని తత్త్వజ్ఞానాన్ని రంగరించి వెలికి తీసిన నవనీతము. ఇందు భక్తి, జ్ఞాన, కర్మయోగముల మేళనమును మృదువుగా, గంభీరముగా, కృష్ణుడు, అర్జునునికి చూపించెను. భగవద్గీత బోధించే ధర్మాలలో గురుశిష్యసంబంధమును గూర్చి చేసిన సూచన చాలాగొప్పది. అర్జునుడు సంశయాలతో నిండిన మనస్సులో విషాదాన్ని అనుభవిస్తూ, తాను యుద్ధమునకు కారకుడనని, తద్వారా ఇందరి మరణానికి కారణభూతుడను కాబోతున్నానని భ్రమించెను. దానిని శ్రీ కృష్ణుడిట్లుఖండించెను.

"క్లైబ్యం మాస్మగమః పార్థనైతత్త్వయ్యుపపద్యతే
క్షుద్రం హృదయ దౌర్బల్యం త్యక్త్వో త్తిష్ఠ పరంతప.

"ఓ అర్జునా నీవు పేడివానివలె వ్యవహరించుటతగదు. (విరాటుని కొలువులో పేడివానిగా ఉన్నబృహన్నలయే ఉత్తర గోగ్రహణములో శత్రుసంహారము చేయగాలేనిది. ఇప్పుడిట్లేమి అని సవాలు) దీని కంతటికి నీ మనోదౌర్బల్యమే కారణము దీనిని విడిచిపెట్టి లెమ్ము. శత్రువులను వడకించు.లే", ఈ ప్రబోధ గీతము. "ఉత్తిష్ఠత జాగ్రత, ప్రాప్యవరాన్నిబోధత" అనే ఉపనిషద్వాక్యాన్ని స్మరింపజేస్తున్నది. కృష్ణుడు పలికిన ఈ పలుకులు ములుకులవలె గ్రుచ్చుకొన్నవి అర్జునుడి గుండెలో. అప్పుడేదో శాపవశాత్తు విరాటరాజు కొలువులో పేడివాడిగా వ్యవహరిస్తే ఆదే పదేపదే తలపించ వలెనా ? తా నింతటి వీరుడు కదా! తాను యుద్ధము మానుకోవడానికి కారణము, తనకు పెద్దల మీద ఉన్న భక్తి ప్రపత్తులుకావా? ఈ నెత్తుటి కూడు తినేదాని కంటే, బిచ్చమెత్తుకొని బ్రతక వచ్చునే? ఏమొ? అర్జునుడి మనస్సు సంశయంతో ముందుకు వెనుకకు ఊగిసలాడ డం మొదలు పెట్టింది. వీటన్నిటి కన్నమిన్న అయింది, కృష్ణుని ఎడల అతని కున్నగాఢ భక్తిభావము. అందుకే తన సంశయాన్ని తీర్చమని ఈ విధంగా వేడుకుంటాడు;

"శిష్యస్తేఽ హంఽశాధి మాం త్వాం ప్రపన్నమ్".

నేను నీ శిష్యుడను, ప్రపన్నుడను. నాకు ఏది శ్రేయో మార్గమో అగు పించుటలేదు. యుద్ధము మానడము మంచిదని నాకు తోస్తే, అది తప్పని నీవు గట్టిగా మందలించితివి. మరిప్పుడేది దారి. నీవే శాసించగలవు." ఈ విధంగా త్రికరణశుద్ధుడై గురువు మ్రోల నిలిచిన అర్జునుడు గీతోపదేశమును గ్రహించే అధికారాన్ని సంపాదించినాడు అర్జునుడనే దూడ ద్వారా పిదికితీసినది గీతా మృతము. ఉపనిషత్తులనే ఆవు పొదుగునుండి శ్రీకృష్ణుడనే గొల్ల పిల్లవాడు అర్జునుడనే దూడకొరకు ఈ అమృతాన్ని పిదికితే దాన్ని త్రాగిఆనందించే వారమే మనమంతా,

గీతార్థసారము, వేదాంతసారము అంతా ఇంద్రియ నిగ్రహములోనే ఉన్న దనితోస్తుంది, కండ్లను, ముక్కును, చెవులను, తదితర ఇంద్రియాలను అదుపులో

పెట్టుకొనగలిగినవాడు కర్మయోగి. అతడే ఫలాపేక్షలేని కర్మను ఏకాగ్రతతో నిరంతరంగా చేయగలుగుతాడు. అప్పుడే మాలిన్యాన్ని తుడిచివేసిన అద్దములో వస్తువు ప్రతిబింబించినట్లు జ్ఞానోదయమవుతుంది. జ్ఞానికే శాశ్వతసుఖము, శాంతము, లభిస్తాయి. "అశాంతస్యకుతః సుఖమ్" అని భగవద్గీత పలికితే, శాంతము లేక సౌఖ్యములేదు. అని త్యాగరాజు గానం చేశాడు భక్తియోగాన్ని సాధించేవారికి ఈ ఇంద్రియనిగ్రహమే ప్రథమ సోపానము. విషయసుఖాలతో తేలుతూఉండే వారికి భగవంతుని మీద మనస్సులగ్నమయ్యేదెట్లా? భగవద్గీతను గానం చేసింది ముసలికాళ్ళ ముదుసళ్ళ కొఱకుకాదు. యువకులకు, యువతులకు వారికే ఇంద్రియాలు కళ్ళెము వదలిపెట్టిన గుఱ్ఱాలవలె పరుగెడుతూ ఉంటాయి. ఆ యింద్రియాలకు మనస్సుబానిసఅయి కోరినచోటంతా వాటిని త్రిప్పుతూ ఉంటే మానవుని ప్రజ్ఞ నశిస్తుంది. పెనుగాలి సముద్రంలో ఓడను కొట్టివేసినట్లు అతడిని కొట్టివేస్తుంది ఇంద్రియలోలుపత్వము. ఓడ ముక్కలయినట్టు, అతని వ్యక్తిత్వము ముక్కలయిపోతుంది. ఇంక జీవితాన్ని సరిదిద్దుకునే దెట్లా? అందుకే తొలిసంధ్య లోనే తోవదప్పకుండా వెలుగుచూపించే భగవద్గీతను చదవకపోతే మలిసంధ్యను చూసేఅవకాశమేపోతుంది, గీతాశ్లోకాన్ని చూడండి:

"మాత్రాస్పర్శాస్తు కౌంతేయ శీతోష్ణసుఖదుఃఖదాః
ఆగమా పాయినోఽనిత్యా స్తాం స్తి తిక్షస్వ భారత"

ఇంద్రియాలకు విషయ సంసర్గమేర్పడినప్పుడు శీతోష్ణసుఖదుఃఖాలు కలుగుతూ ఉంటాయి. సుఖము తరువాత దుఃఖము, ఆతరువాత మళ్ళీసుఖము చక్రభ్రమణరీతిలో వస్తూపోతూఉంటాయి. "చక్రారపంక్తిరివగచ్ఛతి భాగ్యపంక్తిః అనేది భాససూక్తము. చక్రములో అరలు తిరుగుతూ ఒకప్పుడు క్రింద ఉన్న అరమీదికి, మీదిది క్రిందికి వచ్చినట్లు సుఖము వెనుక దుఃఖము ఆ వెనుక సుఖము వస్తూనే ఉంటుంది. అయితే సుఖమును ఎప్పుడూ కోరుకుంటూనే ఉంటాము. దుఃఖము ఎప్పుడు వద్దనుకుంటూనే ఉంటాము. ఈ రెండూ శాశ్వతము కావు తత్త్వవేత్తదీని నెరిగి కొంచెము ఓపిక పట్టడము అలవరచుకోవాలి. ఇదే ఇంద్రియ నిగ్రహము దీనివల్ల లభించేదే మనము కోరుకున్న శాశ్వతసౌఖ్యము.

"దుః ఖేష్వను ద్విగ్న మనాః సుఖేషు విగతస్పృహః
వీతరాగ భయ క్రోధః స్థిత ధీర్మునిరుచ్యతే"

దుఃఖములకు క్రుంగిపోనివాడు, సుఖములమీద వల్లమాలిన కోరిక లేని వాడు, రాగము, భయము, కోపము అనే శత్రువులను జయించగలుగుతాడు. అతడే స్థిత ప్రజ్ఞుడైన ముని "నను ప్రవాతేఽపి నిష్కంపా గిరయః" అనేది కాళిదాసు సూక్తి. ఎంత పెనుగాలివీస్తే మాత్రము కొండలు కంపిస్తాయా, కంపించవుగదా! ఇట్టే మహాత్ములు కూడా. కామ క్రోధాలనే అనర్థ పరంపర ఒకదానితో ఒకటి పెనవేసుకొని ఉన్నవి చూడండి.

"ధ్యాయతో విషయాన్ పుంసః సంగస్తేషూపజాయతే,
సంగాత్సంజాయతే కామః కామాత్క్రోధోభిజాయతే,
క్రోధాద్భవతిసమ్మోహః సమ్మోహాత్ స్మృతి విభ్రమః
స్మృతిభ్రంశాత్ బుద్ధినాశో బుద్ధినాశాత్ ప్రణశ్యతి".

ప్రపంచ సుఖాలనే పట్టించుకొని వాటిలోనే మునుగుతూ, తేలుతూ ఉండే వానికి వాటితో వీడరానిబంధము, ఆ బంధమువల్ల కామము, మిక్కుటమయిన కోరిక కలుగుతుంది కోరికనెరవేరకపోతే క్రోధము కల్గుతుంది. అన్ని కోరికలు నెరవేరడము అసంభవము కదా! మనువు చెప్పినట్లు అగ్నిలో నేయి, హవిస్సు పోసేకొద్ది అది మండుతున్నట్లు, కోరికలు తీర్చేకొద్దీవాటి సంఖ్య పెరిగిపోతుంది:

"న జాతు కామః కామానాముపభోగేన శామ్యతి,
హవిషా కృష్ణవర్త్మేవ భూయ ఏవాభివర్ధతే."

కోరికలు నెరవేరనప్పుడు కోపము రాకమానదు. ఈ కోపమంతటి శత్రువు మరొక్కటి లేదు. ఇదివిచక్షణ జ్ఞానాన్ని పోగొడుతుంది. రామాయణంలో హనుమంతుడు "క్రుద్ధోహన్యాత్ గురూనపి" అని చెప్పినాడు. కోపముతో తల్లి దండ్రులను గురువులను, గూడా చంపడానికి వెనుకాడరు. కాబట్టి కోపపరిణామము మోహము, (అవివేకము) ఆ మూలమున ఇంతకు పూర్వము పెద్దలవలన విన్న మంచి మాటలను మరచి పోతాము. దానివలన నిశ్చయ జ్ఞానము, అనగా అంతః కరణము నశించగా అదిసర్వనాశనానికి దారితీస్తుంది. ధర్మార్థకామమోక్షాలను నాలుగు పురుషార్థాలను సేవించే అర్హతను మనిషి పోగొట్టుకుంటాడని అర్థము.

ఏ అర్థ కామాలకులోనై, మనిషి వివేకహీనుడవుతాడో. వాటికే దూరమయి పోతా డని భావము. అందుకే ఇంద్రియ నిగ్రహము అవసరము. ఇది సాధించే దెట్లా? దీనికొక మార్గమున్నది. ఇది కర్తవ్యము అని భావించి, ఆచెసే పనివల్ల ఏమి ప్రయోజనము, లాభమెంత, నష్టమెంత అని లెక్కవేయకుండా విధినిర్వహణ కొరకు పనిచేస్తే దానితో ఎక్కువ సంగము ఏర్పడదు. ఇదే నిష్కామ కర్మ. కర్మ ఫలంతో మనకు సంబంధము లేదు కదా అని మొక్కుబడి తీర్చుకున్నట్టు పని అయిందనిపించరాదు. పని ఎడల అశ్రద్ధ వహించరాదు. చేస్తున్న పనిని త్రికరణ శుద్ధితో నిర్వహించాలి. నిష్కామ కర్మవల్ల కామక్రోధాదులను జయించ వచ్చును. ఇదే పెద్ద ప్రయోజనము. గీతావాక్యాన్ని మననము చేయండి:

"కర్మణ్యేవాధికారస్తే మాఫలేషు కదాచన
మాకర్మ ఫలహేతుర్భూర్మాతే సంగోఽస్త్వకర్మణి."

కర్మఫలమునపేక్షించకుము ఫలహేతువైన పునర్జన్మమును కోరుకోవద్దు' అకర్మ అనగా పనిలేకుండుట సోమరితనమవుతుంది కాని, నిష్కామకర్మకాదు. ఏది ఆలోచించినా, ఏమీ చేయకుండా ఊరకే కూర్చున్నా అది కూడా ఒక కర్మనే అవుతుంది. కాబట్టి నియమబద్ధమయిన సత్కర్మను ఆచరించి, కర్మఫలాన్ని త్యాగముచేయి అని గీతాశాస్త్రము ఉపదేశిస్తున్నది.

భారతేతిహాసములోని చివరిమూడు శ్లోకాలను "భారతసావిత్రి" అని అంటారు. ఆ శ్లోకాలు ఆణిముత్యాలు చూడండి:

(1) "హర్షస్థాన సహస్రాణి భయస్థానశతానిచ
దివసే దివసే మూఢమావిశంతి నపండితమ్.

(2) ఊర్ధ్వ బాహుర్విరౌమ్యేష న చ కశ్చిచ్ఛృణోతి మామ్.
ధర్మాదర్థశ్చ కామశ్చ స కిమర్థం న సేవ్యతే.

(3) న జాతు కామాన్న భయాన్నలోభాత్
ధర్మంత్యజే జ్జీవితస్యాపి హేతోః
నిత్యో ధర్మః సుఖదుఃఖేత్వనిత్యే
జీవోనిత్యో హేతురస్య త్వనిత్యః."

(1) మూర్ఖుడు తన లక్ష్యాన్ని సాధించలేడు. సాధన మార్గములో చీపురు పుల్ల అంత విఘ్నము అడ్డువచ్చినా నెత్తికి చేతులుపెట్టుకొని ఆలోచనలో పడిపోతాడు. ప్రతిరోజు వేలకొలది వార్తలు సంతోషకరమయినవి వింటూ కాలాన్ని ఆ నెపంతో వెళ్ళబుస్తాడు అట్లే ప్రతిచిన్నదానికి భయపడుతూ, ఆ భయంలో తన వివేకాన్ని పోగొట్టుకుంటాడు. ఇంక మంచిని సాధించేదెట్లా? లక్ష్యాన్ని చేరుకునేదెప్పుడు? ఈ అంతరాయాలు పండితుని మనస్సును కల్లోలితము చేయలేవు.

(2) వ్యాసుడు పరమకారుణికుడు కదా! తనకు తెలిసిన రోగనిదానాన్ని అందరికి తెలియజేయాలన్న తపన అతనిలో ఏర్పడింది. మనిషికి కావలసింది డబ్బు, సుఖము, (అర్థము, కామము) కదా! అవి లభించే ఉపాయము అతడికి తెలుసు. అయితే వినేదెవరు ? చేతులు పైకెత్తి దూరదూరాలలో ఉండే వారిని గూడా నిర్దేశించి అరుస్తున్నాడు వ్యాసభగవానుడు, "నా మాట వినండి, వినండి'', అని ఏ మా మాట? "మీరు ధర్మాన్ని ఆచరిస్తే అదే అర్థకామాలను సంపాదించి పెడుతుంది. దాన్ని మీరెందుకు ఆచరించరు'' ?

(3) కామము చేతగాని, భయమువల్లగాని, లోభముతోగాని, చివరకు ప్రాణము మీదకు వచ్చినా సరే ధర్మాన్ని మాత్రము విడిచిపెట్టరాదు. ఏ సుఖదుఃఖాలను దృష్టిలో పెట్టుకొని ధర్మాన్ని త్యజిస్తామో అవి శాశ్వతము కాదు. ధర్మమే శాశ్వతమయినది. జీవుడు నిత్యుడు, జీవుని బంధనానికి కారణభూతమయిన జన్మ. శరీరము అనిత్యము.

జీవుడు, నిత్యుడు జన్మలు తాత్కాలికములు అన్న సత్యాన్ని గీతావాక్య మెంత అందంగా పలికిందో చూడండి.

"వాసాంసి జీర్ణాని యథావిహాయ నవాని గృహ్ణాతి నరోఽపరాణి,
తథాశరీరాణి విహాయజీర్ణాన్యన్యాని సంయాతి నవాని దేహీ''.

దేహమనగా శరీరము, దేహిఅనగా ఆత్మ, చిరిగిపోయి కట్టుకోవడానికి వీలులేని బట్టలను మనము మార్చివేసినట్లే జీర్ణమయి నివాసయోగ్యము కాని, దేహా లను విడిచిపెట్టి ఆత్మ ఇతరదేహాలను ప్రవేశిస్తూ ఉంటుంది. అయితే ఇక్కడ ఒక్క ప్రశ్నరావచ్చును. ఒక్కొక్కసారి వెలసిపోయిన బట్టను సరిగ్గా అతికినట్లు

కుట్టని బట్టను చిరగక ముందే మనము మార్చివేస్తున్నాము కదా ! ఆత్మగూడా అంతేనా? అంతే ! మనకు ఆ శరీరము ఆరోగ్యములో ఉన్నట్లు, యౌవనదశలో ఉన్నట్లు తోచవచ్చును. కాని ఆత్మకది, నివాసయోగ్యము కాకపోవచ్చును. ఇది ఉపమాలంకార రమ్యత, ముక్కుకు సూటిగా అభిధతో చెప్పదలచుకున్న మాటను వ్యాసుడు చెప్పినట్లితరులు చెప్పలేదేమో !

దేహాలను, చిఱిగినబట్టలను మార్చినట్లు మార్చే ఈ ఆత్మ స్వరూపమెట్టిది? చూడండి.

"నజాయతే మ్రియతే వా కదాచి
న్నాయం భూత్వాఽభవితా వా నభూయః
అజో నిత్యః శాశ్వతోఽయం పురాణో
న హన్యతే హన్యమానే శరీరే''.

ఈ ఆత్మకు జననమరణాలు లేవు. ఇది ఒకప్పుడుండి తిరిగి నశించు స్వభావము కలదికాదు. అందుకే దీనికి మరణముండదు. ఒకప్పుడు ఆస్తిత్వము లేక తిరిగి అస్తిత్వము దీనికేర్పడదు. అంటే జన్మకూడా లేదని అర్థము. జన్మ లేనిది కావున ఇది 'అజము' అని వ్యవహరింపబడును. మృత్యువు లేనిది కాన 'నిత్యము' శాశ్వతము అనగా ఎట్టి వికారములును లేనిది అని భావము ఇట్టిందు బాహిరములైన ఆయుధములు ఉత్పాతములు దీనినెట్లు నశింపజేయగలవు?

"నైనం ఛిందంతి శస్త్రాణి నైనం దహతి పావకః
న చైనం క్లేదయంత్యాపో న శోషయతి మారుతః"

శస్త్రములు దీనిని ఛేదింపజాలవు అగ్నిదహించలేదు. నీరు ముంచివేయ లేదు. గాలి ఎండగొట్టలేదు. విధి నిర్వాహణలో ఉద్యుక్తుడైన సాధకుడు తానే ఆత్మనని, దేహమును కానని గ్రహించవలెను. మనలను ఉద్ధరించేది బాహిరములైన శక్తులు కావు. తనను తానే ఉద్ధరించుకొనవలెను ;

"ఉద్ధరేదాత్మనాత్మానం నాత్మాన మవసాదయేత్
ఆత్మైవహ్యాత్మనో బంధుః ఆత్మైవ రిపురాత్మనః''

ఆత్మచేతనే ఆత్మను ఉద్ధరించుకొనవలెను. సంసారసాగరములో మునిగిన ఆత్మను ఉద్ధరించగల సామర్థ్యము ఇతర శక్తుల కెట్లుండును. అట్లుయోగారూఢు

డైన వ్యక్తి క్రిందకు పడిపోకుండా తనను తాను రక్షించుకొనవలెను. ఆత్మయే ఆత్మకు బంధువు. ఇతర బంధువర్గము స్నేహపాశములచే బంధనమును పెంచెను. అట్లే తనకు తానే శత్రువు. తనలోనున్న కామక్రోధాదుల వలననే బాహ్య శత్రువుల నేర్పరచు కొందురు కదా మానవులు.

ఇక భక్తుడనగా ఎట్టివాడు ? ఇది మిలియన్ డాలర్ల ప్రశ్న రోజూ దేవాలయానికి పోయేవాడే భక్తుడా ? దానికి సమాధానాన్ని వినండి. మనస్సును లగ్నము చేయడానికి మందిరములోని దేవుడిని అర్చించడము మన విధి. అయితే అంతటితో చాలదు.

> "యస్మాన్నోద్విజతేలోకో లోకాన్నోద్విజతే చయః
> హర్షామర్ష భయోద్వేగైః ముక్తోయః సచమేప్రియః"

(భక్తియోగము)

ఎవరి ప్రవర్తన వలన, ఎవరి సమక్షములో లోకులకు ఉద్వేగము కలుగదో, ఎవరు లోకులను చూచి ఉద్వేగమును పొందడో సంక్షోభమును సంతాపమును పొందడో, అట్టివాడే భగవంతునకు ప్రియుడు. భక్తుడు. అతడు సంతోషము, కోపము, భయము, ఉద్వేగము వంటి భావములకు లోనుగాడు శుద్ధసత్వసంపన్నుడతడు.

భక్తుడు తన మనస్సును, బుద్ధిని భగవంతునియందు లగ్నము చేయవలెను. అట్లు చేయశక్యము కానిచో అభ్యాసయోగము చేత దీనిని సాధించవలెను. పలుతెఱగుల పరుగెత్తే చిత్తమును తిరిగి ఏకాగ్రముగా చేయుట అభ్యాసయోగము. ఇది కూడా చేతకానప్పుడు భగవంతుని కొఱకు ఏదైన సత్కర్మను సంకల్పించి చేయవలెను. దీనివలన గూడా సిద్ధి లభించును. దేవాలయాలు, బడులు నిర్మించుట బావులు త్రవ్వించుట, ఛాయావృక్షాలను నాటించి బాటసారుల బడలికను తీర్చుట, దేవతా ప్రీతికి సంతర్పణము చేయుట ఇట్టి కర్మలే. అది కూడా చేత కానప్పుడు మనము చేసే ప్రతి పని యొక్క ఫలాన్ని భగవంతునికి అర్పించాలి. అనగా భక్తుడు కర్మయోగి కావలెనని భావము చూడండి.

> "శ్రేయో హి జ్ఞానమభ్యాసాత్ జ్ఞానాత్ ధ్యానంవిశిష్యతే
> ధ్యానాత్ కర్మ ఫలత్యాగః త్యాగాచ్ఛాంతిరనంతరమ్"

కేవలము అభ్యాసయోగముకన్న, జ్ఞానముమిన్న. జ్ఞాన పూర్వకమగు ధ్యాన యోగమునకన్న, కర్మఫలత్యాగము చేయుట విశేషము. కర్మఫలత్యాగము వలననే అనగా సంసార బంధమోచనము తరువాతనే శాంతి లభించును, అన్యత్ర అది అసంభవము. ఈపై శ్లోకములో భక్తి జ్ఞాన కర్మయోగముల సమ్మేళనము ఎంత సహజముగా నున్నది!

సన్మార్గదర్శన మందరికి సులభమా? కానేకాదు. మరి ఏంచేయాలి? చూడండి.

"యద్యదాచరతి శ్రేష్ఠ స్తత్తదేవేతరో జనః
సయత్ప్రమాణం కురుతే లోక స్తదను వర్తతే''

శ్రేష్ఠ మానవుడు అనగా సర్వథా ఇతరుల కన్న గొప్పవాడై, అందరి దృష్టిని ఆకర్షించినవాడు. ఏపని చేస్తే, ఇతరులదే మార్గాన్ని అనుసరిస్తారు. కాబట్టి లోకులనుద్ధరించే భారము శ్రేష్ఠులపై ఉంటుంది. లోకులంతా తరించనిదే తమ ముక్తి వద్దని కోరుకొనే బోధిసత్వులీకోవకుచెందిన వారు. తాము ఉత్తమగతికి పోయి ఇతరులకు గూడా చేయూత నివ్వగలవాడే మహాత్ముడు. ఇట్టి మహాత్ములొక్క సారి ప్రబోధగీతము పాడితేచాలదు. భగవద్గీత, ఒక్కసారైతేలు ఉద్ధరించ జాలినవైతే ఇన్ని హింసాకాండలు చెలరేగి ఉండేవికావు. మధ్యమధ్య తరచుగా మహాపురుషులు జన్మిస్తూనే ఉండాలి. గీతావాక్యాన్ని వినండి.

"యదా యదా హి ధర్మస్య గ్లానిర్భవతి భారత
అభ్యుత్థాన మధర్మస్య తదాత్మానం సృజామ్యహమ్

ఎప్పుడెప్పుడు ధర్మానికిగ్లాని కలుగుతుందో, ఎప్పుడు అధర్మము తల ఎత్తుతుందో, అప్పుడు దేవుడే మానవుల మధ్య జన్మిస్తాడు. దుష్టులను శిక్షించి శిష్టులను రక్షించి ధర్మాన్నిస్థాపిస్తాడు. అంటే బలహీనులను, మంచివారిని రక్షించేవాడు దివ్యాంశసంభూతుడే ఈ భగవంతుని ప్రీతికై ఏంచేయాలి కొండలు త్రవ్వ నక్కరలేదు:

"పత్రం పుష్పం ఫలం తోయం యో మే భక్త్యాప్రయచ్ఛతి,
తదహం భక్త్యుపహృతమిచ్ఛామి ప్రయతాత్మనః''

భగవంతుడు భక్తుని మనస్సు స్వచ్ఛంగా ఉన్నదాలేదా అని పరీక్షిస్తాడు. ఇంద్రియ నిగ్రహమున్న భక్తుడు ఒక్క ఆకును. పూవును,పండును లేదా కేవలము నీటిని సమర్పించినా దాన్ని భగవంతుడు ప్రీతితో స్వీకరిస్తాడు. అంతేగాక తనను ఏకాగ్రచిత్తముతో అర్చించేవారి యోగక్షేమాలను గూడ భగవంతుడే చూచు కుంటాడు.

సాధకుడు ఎట్టి జీవితాన్ని గడపాలి? ఇదిగో సమాధానము.

"నాత్యశ్నతస్తు యోగోఽస్తి న చైకాంత మనశ్నతః
నచాతి స్వప్నశీలస్య జాగ్రతో నైవ చార్జున
యుక్తాహార విహారస్య యుక్త చేష్టస్య కర్మసు
యుక్త స్వప్నావ బోధస్య యోగో భవతి దుఃఖహా"

విపరీతముగా తిండితినేవాడు దేనినీ సాధించలేడు. తిండి లేక శరీరాన్ని పూర్తిగా కృశింపజేసేవాడూ వ్యర్థుడే. పూర్తిగా ఆహారాన్ని మానివేసిన గొప్ప జ్ఞానులు ఏమైనా దేహాన్ని నిలుపుకోగలరేమోగాని సామాన్య యోగి కది సాధ్యము కాదు? శ్రీరామకృష్ణ పరమహంస సమాధిలోనికి పోతే శిష్యులతనిని ఒక్కొక్క సారి కట్టెతో కొట్టి సమాధిని భంగపరచి ఆహారాన్ని పెట్టేవారట. అట్లే ఎప్పుడు నిద్రించేవానికి బుద్ధి వ్యవసాయము సున్న. ఎప్పుడు మేల్కొనే ఉండడానికి. ప్రయత్నించినా ఫలితము శూన్యమే, అందుకే మితంగా తినాలి. మితంగా నిద్రించాలి. మితంగా వ్యవహరించాలి. ఇదీ యోగసాధన రహస్యము. సాధన మార్గంలో యోగి అవసరము కొనవలసిన దైవీసంపద ఎట్టిదో అతి సుందరంగా గీతాకారుడు వివరించినాడు. చూడండి, !

అభయం సత్త్వసంశుద్ధిః జ్ఞానయోగ వ్యవస్థితిః
దానం దమశ్చ యజ్ఞశ్చ స్వాధ్యాయస్తప ఆర్జవమ్
అహింసా సత్యమక్రోధస్త్యాగః శాంతి రపైశునమ్,
దయా భూతేష్వ లోలుప్త్వం మార్దవం హ్రీరచాపలమ్.
తేజః క్షమాధృతిః శౌచ మద్రోహో నాతిమానితా
భవంతి సంపదం దేవీమభిజాతస్య భారత

ఈదైవ సంపద అంటే ఏమిటో జాగ్రత్తగా యోచించి తెలుసుకుందాము. పిరికితనము లేకుండుట, సత్త్వసంశుద్ధి (ఇతరులను వంచించుట, మాయ, అనృతము

మున్నగు వానిని వర్జించి అంతఃకరణాన్ని శుద్ధపరచుకొనుట), జ్ఞానయోగవ్యవస్థానము (జ్ఞానమంటే శాస్త్రము ద్వారా, గురువు ద్వారా ఆత్మజ్ఞానాన్ని తెలిసికోవడం, ఈ జ్ఞానంతో ఇంద్రియ నిగ్రహాన్ని సాధించి ఏకాగ్రతతో ఆత్మానుసంధానము చేయడము యోగము. ఈ జ్ఞాన యోగముల స్థైర్యమే ప్రధానమైన దైవీ సాత్త్విక సంపద) యథాశక్తి దానము చేయడం. (అన్నిదానాలలో అన్నదానము గొప్పది అని అంటారు. అన్నదానము అప్పటి కప్పుడు కడుపు నింపుతుంది గాని శాశ్వతంగా మనిషి సమస్యలను తీర్చలేదు. విద్యాదానము, సన్మార్గనిర్దేశము చేసే ఉపదేశ దానము చాలా గొప్పవి), దమము (బాహ్యేంద్రియ నిగ్రహము) శ్రౌతస్మార్తయజ్ఞాలు, స్వాధ్యాయము (ఋగ్వేదాదులను అధ్యయనం చేయడం) తపస్సు, ఋజువర్తనము, అహింస (ప్రాణులను పీడించకుండుట), సత్యము (అప్రియము, అనృతము భాషించకుండుట), అక్రోధము (ఎదుటివాడు దెబ్బ తీసినప్పుడు గూడా కోపాన్ని ఉపశమింప చేసికోవడం), త్యాగము, శాంతి (అంతఃకరణాన్ని ఉపశమింపజేసుకోవడం)శమము, దమము బాహ్యేంద్రియాలను ఉపశమింప జేసుకోవడం), అపైశునము (పరోక్షములో ఒకరితో ఇంకొకరి తప్పులను ఎన్ని చాడీలు చెప్పడము పైశునము. అదిలేకుండుట అపైశునము), భూతదయ, ఇంద్రియాలకు బానిసకాకుండ తననుతాను నిగ్రహించుకోవడం విషయ సన్నిధిలోగూడా ఎట్టి వికారాన్ని పొందకుండుట ("వికారహేతౌసతి విక్రియంతే యేషాం న చేతాంసి త ఏవధీరాః), మృదువుగా వ్యవహరించడము (కఠినంగా పరుషంగా మాట్లాడే మంచిమాట గూడా తగిన ప్రయోజనాన్ని సాధించదు), లజ్జ, చాపల్యము లేకుండుట (ఏకారణము లేక ఊరకే కాళ్ళను, చేతులను ఆడించకుండుట) తేజస్సు (ఇది కేవలము శరీరప్రకాశము కాదు. ప్రాగల్భ్యము), క్షమ (దెబ్బతిన్నప్పుడు కూడా మనస్సు ఏ వికారాన్ని చెందకుండుట, ఓర్పు. వికారమే కలుగకుండడం ఓర్పు, వికారం కలిగినప్పుడు దాన్ని శమింపజేయడం అక్రోధము.) ధృతి (శరీరము, ఇంద్రియాలు అలసి సొలసినప్పుడు, ఆ అలసటను పోగొట్టే అంతఃకరణ వృత్తియే ధృతి, ఈ ధృతి వలన ఉత్సాహాన్ని పొందిన శరీరము, ఇంద్రియాలు ఇక అలసటను పొందవు), శౌచము (బాహ్యేంద్రియముల శుభ్రత, మనోబుద్ధుల నైర్మల్యము అని శౌచము రెండువిధాలు), అద్రోహము, తనను తాను గొప్పగా చెప్పకుండటము, ఇవన్నీ దైవీసంపదలు, ఇట్టి సంపదలతో సంపన్నుడయిన వాడు అభిజాతుడు. దీనివలన అతడు ముక్తిని పొంద గలుగుతాడు ముక్తిని

పొందటము అని అంటే సంసార బంధాలనుండి విడుదలను పొందటము అని అర్థము.

అయితే దీనికి వ్యతిరేకమైన భావాలేవి? వాటి ఫలితమేమి?- దంభము, దర్పము, అతిమానము (అహంకారము) క్రోధము పరుషత్వము, అజ్ఞానము ఇవి ఆసురీసంపదలు దీనివలన సంసారబంధము పెరుగుతుంది ఇవి బంధానికి,మోక్షానికి ఉండేభేదము. యమ, నియమాలను వివరిస్తూ భాగవతములోని ఏకాదశస్కందంలో శ్రీకృష్ణుడు ఉద్ధవునికి చేసిన ఉపదేశంలో ఇంచుమించు ఇవే దైవీసంపదలను వివరించినాడు చూడండి :

"అహింసా సత్యమస్తేయ మసఙ్గో హ్రీరసంచయః
ఆస్తిక్యం బ్రహ్మచర్యం చ మౌనం స్థైర్యం క్షమా ఒభయమ్.
శౌచం జపస్తపోహోమః శ్రద్ధాతిథ్యం మదర్చనమ్,
తీర్థాటనం పరార్థేహా తుష్టిరాచార్యసేవనమ్."

అహింస, సత్యము, దొంగతనము చేయకుండుట, అసంగము, హ్రీః(లజ్జ) అసంచయము (ధనాన్ని కూడబెట్టకుండడం), ఆస్తిక్యము ఆస్తికభావము, బ్రహ్మచర్యము, మౌనము, స్థైర్యము, అభయము, శౌచము, జపము, తపము, హోమము, శ్రద్ధ, ఆతిథ్యము, భగవదర్చనము, తీర్థయాత్రలు చేయడం, పరోపకారము, సంతుష్టి, ఆచార్య సేవనము ఇవి యమనియమములు. పేరేది పెట్టినా సాధన ఒకటే. చూడండి మంచిని పెంచడమంటే ఎంతకష్టమో. అది అసిధారా వ్రతమే కదా !

"యత్ర యోగేశ్వరః కృష్ణో యత్ర పార్థోధనుర్ధరః
తత్రశ్రీ ర్విజయో భూతి ర్ధ్రువా నీతిర్మతిర్మమ".

ఇది గీతాశాస్త్రములోని చివరిశ్లోకము.ఏపక్షాన యోగేశ్వరుడయిన కృష్ణుడుండునో,ఎక్కడ ధనుర్ధారి అయిన అర్జునుడుండునో,అక్కడే శ్రీ,అక్కడే విజయము ఉంటుంది అని సంజయుడు పలికెను. భుజ బలానికి యోగశక్తి జోడించబడ్డప్పుడే ధర్మయుద్ధము విజయవంతమవుతుంది.

"నారాయణం నమస్కృత్య నరంచైవ నరోత్తమమ్
దేవీం సరస్వతీం వ్యాసం తతోజయ ముదీరయేత్"

నరనారాయణులకు, సరస్వతీదేవికి, వ్యాసునికి నమస్కరించి జయమును (భారతాన్ని) పఠించాలి. విఘ్ననాయకునకు విఘ్నాలను తొలగించమని విన్నపము చేసికోవాలి. ఇది భారతారంభశ్లోకము.

''ఆత్మన్యపి న విశ్వాసస్తథా భవతి సత్సు యః
తస్మాత్సత్సు విశేషేణ సర్వః ప్రణయ మిచ్ఛతి.''
సౌహృదాత్సర్వభూతానాం విశ్వాసో నామ జాయతే
తస్మాత్ సత్సు విశేషేణ సర్వః ప్రణయ మిచ్ఛతి.''

పై రెండు శ్లోకాలు సావిత్ర్యుపాఖ్యానంలోనివి. లోకము పరస్పర విశ్వాసము మీద ఆధారపడి నడుస్తున్నది. మానవుడు తన పరిమిత జీవనకాలంలో అనుభవపూర్వకంగా తెలుసుకొనేది చాలా తక్కువ. సర్ ఐజాక్ న్యూటన్ అంతటి భౌతిక శాస్త్రవేత్త కూడ సముద్రతీరంలోని ఇసుకరేణువులలో ఒక రేణువంత జ్ఞానాన్ని సంపాదించితినో లేదో, ఇసుకలో ఆడుకొనే పిల్లవానితో సమానము తన జ్ఞానము అని వినయంతో చెప్పుకున్నాడు' అంటే మనకు తెలియని విషయాలను గూర్చి ఏంచేయాలి? ఆప్తవాక్యం పై ఆధారపడాలి. తనపై తనకు విశ్వాసం లేక పోవచ్చును. కాని సజ్జనుల వాక్యముపై విశ్వాసం తప్పకుండా ఉంటుంది. అందుకే మంచి వారితో కలసి కాలం గడపాలని అనుకుంటూ ఉంటారు. ''సతాం సద్భిః సంగః కథమపి హి పుణ్యేన భవతి'' ఒక మంచివానికి మరొక మంచివానితో పరిచయము పూర్వపుణ్య విశేషమువలననే కదా ఏర్పడుతుంది. వారి సమావేశము లోకకళ్యాణానికి దారితీస్తుంది. సంసారమనే విషవృక్షానికి రెండే అమృతఫలాలని పంచతంత్రం చెబుతున్నది. అవేవి.

"సంసార విషవృక్షస్య ద్వేఫలే అమృతోపమే
కావ్యామృత రసాస్వాదః సంగతిః సజ్జనైః సహ''.

పెద్దలమాట మీద విశ్వాసము ఏర్పడేదెట్లా? అన్ని భూతముల ఎడల అంటే అన్ని జీవుల మీద సుహృద్భావముంటే, విశ్వాసము అనేది ఏర్పడుతుంది. మంచి వారిని విశ్వసించడం ఇంకా గొప్పకదా! ఎవరో కొందరు ద్రోహబుద్ధి కల వారు తప్ప మనుష్యులందరూ మంచివారే. అను గాఢమైన నమ్మకము విశ్వాసము. మనుష్యులలో ఇంకొక తరగతికి చెందినవారు కూడా ఉంటారు. నిశ్చయముగా మంచివారని నిర్ణయమయ్యేదాక, ఎదుటివారంతా చెడ్డవారేనని అనుకోవడం. అంటే

ఎదుటివారిని నమ్మకపోవడం నమ్మనివారికి విశ్వాసమెట్లా ఏర్పడుతుంది? ఏర్పడదు.

"అద్రోహః సర్వభూతానాం కర్మణా మనసాగిరా
అనుగ్రహశ్చ దానంచ సతాం ధర్మః సనాతనః".

ఇది కూడా సావిత్రికథలోనిదే, సనాతనధర్మము అనే పదానికిక్కడ ఒక నిర్వచనము లభించింది. మనస్సుచే, వాక్కుచే, కర్మచే సర్వభూతములకును హానిని తలపెట్టకుండుట, దానము, అనుగ్రహము ఇది సనాతనధర్మము. అధునాతన ధర్మమూ ఇంతే చెబుతున్నది. అయితే పానీయము పాతదైనా పాత్ర కొత్తది కాబట్టి దాన్ని మనము గుర్తించాలి.

"శ్రవణం కీర్తనం విష్ణోః స్మరణం పాదసేవనమ్
అర్చనం వందనం దాస్యం సఖ్య మాత్మ నివేదనమ్"

మహావిష్ణువు పుణ్యకథలను వినడం, హరినామ సంకీర్తనం చేయడం, విష్ణువును స్మరించడం, హరిపాద సేవనము, వందనము, దాస్యము, సఖ్యము, ఆత్మ నివేదనము అని భక్తి నవవిధములతో ఒప్పుతున్నది. అని భాగవత పురాణము చెబుతున్నది. భక్తిపారమ్యాన్ని వర్ణించి చెప్పేవే పురాణాలు. ఈ పురాణాలు మిత్ర సమ్మితాలు. అంటే స్నేహితునివలె హితవును చెప్పేవి అని అర్థము. పురాణాల లక్ష్యము ప్రవచనము గనుక ఇందులో పునరుక్తమవుతూనే ఉంటాయి అనేక శ్లోకాలు. అనేక సుభాషితాలు. గురువు శిష్యుడిని దగ్గరకు తీసి ఒకే హితవును రెండు మాట్లుచెప్పాడా? చెప్పినమాటనే పదిమార్లు పదిమందికి చెప్పాడా? ఇదే పురాణాలలోని పునరుక్తి వైశిష్ట్యము. పురాణాలసంఖ్య ఎక్కువగా ఉన్నట్టే వ్యాసుల సంఖ్యగూడా ఇరువది ఎనిమిది అని సంప్రదాయము చెబుతున్నది. ప్రతి కల్పానికి ఒక వ్యాసుడు ఉంటాడని అంటారు. దీన్ని బట్టిగూడా వ్యాస నామము బిరుదనామమే. డాక్టరు, ఇంజనీరు, ఆఫీసర్ అని వ్యవహరించినట్లు వారు నిర్వర్తించే ధర్మాన్నిబట్టి వచ్చేపేరే అయిఉంటుందని అనిపిస్తుంది. ప్రధాన పురాణాలు పదునెనిమిది. అవి సాత్త్విక, రాజస, తామస పురాణాలని మూడు విధాలుగా విభజింప బడినవి. పురాణాల పేర్లను వినండి.

"మద్వయం భద్వయం చైవ బ్రత్రయం వ చతుష్టయం
అ న పద్లింగ కూ స్కాని పురాణాని పృథక్ పృథక్"

మత్స్య పురాణము, మార్కండేయ పురాణములు మద్వయంలో అంతర్గతములు. భద్వయమనగా భాగవత,భవిష్య పురాణములు. బ్రత్రయ మంటే బ్రహ్మ పురాణము, బ్రహ్మవైవర్త పురాణము, బ్రహ్మాండ పురాణము, వరాహ, వామన, వాయు విష్ణు పురాణాలు వచతుష్టయముచే సూచితములు. అ అంటే అగ్ని పురాణమున, "న" నారద పురాణము.

మద్వయమ్ - మత్స్య, మార్కండేయ పురాణాలు
భద్వయమ్ - భాగవత, భవిష్య పురాణాలు
బ్రత్రయమ్ - బ్రహ్మ, బ్రహ్మాండ, బ్రహ్మవైవర్తములు
వచతుష్టయమ్ - వరహ, వామన, వాయు, విష్ణు పురాణములు

అ - అగ్ని పురాణము
న - నారద పురాణము
పద్ - పద్మ పురాణము
లిం - లింగ పురాణము
గ - గరుడ పురాణము
కూ - కూర్మ పురాణము
స్కా - స్కాంద పురాణము

వీటన్నిటిని సాత్విక, రాజస, తామస పురాణాలుగా పునర్వర్గీకరిస్తారు.

వీనన్నింటిలో భాగవతము కృష్ణకథను వర్ణిస్తూ అతిప్రశస్తమయినది. పురాణాలన్నీ ఒక ఎత్తు భాగవతము మాత్రము ఒక ఎత్తు అని పౌరాణికులంతా ఒప్పుకున్నారు. భాగవత పురాణములోని దశమస్కంధాన్ని మాత్రమే ఇక్కడ గ్రహించి అందులోని సుందరవర్ణనలను దిఙ్మాత్రంగా ఉదహరిస్తాను.

## ఋతువర్ణనము

ప్రకృతి వర్ణనములో వాల్మీకిని మించినకవి లేడని అంటారు. తెలుగు కవి శ్రీశ్రీ రామాయణం చదవనారంభించి పరవశుడై రస తరంగాలలో తేలిపోయి ఇక చదివిన తరువాత కవిత్వం చెప్పడమంటే సాహసమేనని తలపంకించినాడట. ఇక్కడ మచ్చుకు వ్యాసుడు భాగవతపురాణంలో చేసిన ఋతువర్ణనాన్ని చూసి ఆనందాన్ని మనము కూడా పంచుకుందామా? వాల్మీకితో పోటీపడవలెనంటే అది ఒక్క వ్యాసునికే సాధ్యము,

# వర్షా వర్ణనము

“తతః ప్రావర్తత ప్రావృట్ సర్వసత్వసముద్భవా,
విద్యోతమానపరిధి ర్విస్ఫూర్జిత నభ స్తలా.
సాంద్ర నీలాంబుదై ర్వ్యోమ సవిద్యుత్ స్తనయిత్నుభిః,
అస్పష్ట జ్యోతి రాచ్ఛన్నం బ్రహ్మేవ సగుణం బభౌ.
అష్టౌమాసాన్ నిపీతం యద్ భూమ్యాశ్చోదమయం వసు,
స్వగోభిర్మోక్తుమారేభే పర్జన్యః కాల ఆగతే.
తపః కృశా దేవమీఢా ఆసీద్ వర్షీయసీ మహీ,
యథైవ కామ్య తపస స్తనుః సంప్రాప్య తత్ఫలమ్.
నిశాముఖేషు ఖద్యోతాః తమసాభాంతి న గ్రహాః,
యథా పాపేన పాషండా నహివేదాః కలౌయుగే.
హరితా హరిభిః శష్పైరింద్రగోపైశ్చ లోహితా,
ఉచ్ఛిలీంధ్ర కృతచ్ఛాయా నృణాం శ్రీరివ భూరభూత్.
క్షేత్రాణి సస్యసంపద్భిః కర్షకాణాం ముదం దదుః,
ధనినా ముపతాపం చ దైవాధీన మజానతామ్.
సరిద్భిః సంగతః సింధుశ్చుక్షుభే శ్వసనోర్మిమాన్,
అపక్వయోగినశ్చిత్తం కామాక్తం గుణయుగ్యథా.
గిరయో వర్షధారాభి ర్హన్యమానా న వివ్యథుః,
అభిభూయమానా వ్యసనై ర్యథాధోక్షజ చేతసః.
మార్గా బభూవుః సందిగ్ధా స్తృణైశ్ఛన్నా హ్యసంస్కృతాః,
నాభ్యస్యమానాః శ్రుతయో ద్విజైః కాలహతాయథా.
ధనుర్వియతి మాహేంద్రం నిర్గుణంచ గుణిన్యభాత్,
వ్యక్తే గుణవ్యతికరేఽగుణవాన్ పురుషోయథా.
పీత్వాపః పాదపాః పద్భిరాసన్నానాత్మ మూర్తయః
ప్రాక్ క్షామా స్తపసా శ్రాంతా యథాకామాను సేవయా.
ధేనవో మందగామిన్య ఉధోభారేణ భూయసా,
యయుర్భగవతాహూతా ద్రుతం ప్రీత్యా స్నుత స్తనీః.”

(భాగవతం దశమస్కందం)

అన్ని సత్వములను సస్యముల సృజింపజేసీ ప్రావృట్కాలము మెరు పులతో చుట్టుపట్ల ప్రదేశాన్ని ఆకాశాన్ని వెలిగింపజేస్తూ మనోహరమై ప్రవర్తింప సాగెను. ఆకాశము చిక్కని నల్లనిమేఘాంతో మెరుపులతో, ఉరుములతో అస్పష్ట మైన ప్రకాశముతో ఒప్పసాగెను. అస్పష్టజ్యోతి ఆకాశాన్ని కప్పివేయగా ఆ ఆకాశము సగుణబ్రహ్మమువలె ప్రకాశించెనట. భూమి నుండి ఉదక రూపమైన సంపదను కాలము ఎనిమిది నెలలు కడుపునిండా త్రాగివేసింది, ఇప్పుడు పర్జ న్యుడు అనగా వర్షదేవుడు జలధారలను విడిచిపెట్టడం మొదలు పెట్టాడు. ఎండ కాలములో కృశించిపోయిన భూమి వర్షదేవుని కృపవలన తడిసి పుష్టమయ్యెను ఏదో ఒక కోరికతో తపస్సు చేసేవారి శరీరము తపస్సుతో కృశించి తిరిగి ఫలము లభించి నప్పుడట్లే పుష్టమయిపోతుందికదా! రాత్రిళ్ళు అంధకారము నిండిపోతుంది. మిణుగురుపురుగుల కాంతియే తప్ప, గ్రహముల కాంతి ప్రకాశమానముకదా. కలియుగములో పాపము పెరిగినందులకు పాషండమతములు వ్యాప్తిలోనికి వస్తాయిగాని వేదములకు ఆదరణముండదుగదా! పచ్చని గడ్డిపెరుగగా భూమి ఆకుపచ్చచీరకట్టుకున్నముత్తైదువువలె కనిపించింది. ఇంద్రగోపాలనే పురుగుల వలన తమలపాకు నమిలి పెదవి ఎఱ్ఱబడినట్లయింది. కుక్కగొడుగు అనే ఛత్రము కింద లక్ష్మీదేవివలె ప్రకాశించింది భూయాతె. సస్యసంపద దైవాధీనము. దేవుడు తలుచుకుంటే రైతులకు విశేషధాన్యాన్ని పండించి ఇచ్చి వారికరువును తీరుస్తాడు. ఈ సంగతి తెలియనివారు రైతుల జీవితాలను పిడికిళ్ళలో బిగించుకొని ఉంచిన ధనికులు. రైతులు సంపద వారికి కంటగింపఅయింది. గాలితాకిడికి అలలు ఎత్తి కొడుతూఉంటే నదీముఖముల వద్ద సముద్రుడు క్షోభించెను. త్రిగుణాల సంఘర్షణ తో కామ భరితమైన అపక్వయోగి చిత్తము అతని యోగమింకా పక్వదశను చేరు కొనకముందు అంతటి క్షోభనే అనుభవిస్తుంది. జలధారల దెబ్బకు గూడా పర్వతాలు చలించలేదు. అధోక్షజుని యందు మనస్సు లగ్నము చేసినభక్తులకు ఎన్నికష్టములు వచ్చినా చలనముండదుకదా! గడ్డి అడ్డదిడ్డముపెరిగి మార్గము చదునుచేయనందున ఏదోవ, ఎటు పోతుందో తెలియకుండా సందిగ్ధమయిపోయింది. అభ్యాసము చేయ కుండా కాలదోషము పట్టిన వేదములూ అసంస్కృతములై సందిగ్ధములయిపోతవి. "శబ్దగుణకమాకాశమ్'' అని శాస్త్రులు చెబుతున్నవి. అంటే ఆకాశము యొక్క

గుణము శబ్దము శబ్దమాకాశము గుండా ప్రయాణము చేసి ఒకరిమాట మరిఒకరికి, వినిపిస్తుంది. ఆకాశము ఆవిధంగా గుణవంతము. వర్షాకాలములో ఆకాశంలో మెరసే ఇంద్రధనుస్సు మాత్రము నిర్గుణము, అనగా అల్లెత్రాడు లేని ధనుస్సు అని భావము. ఒక్కొక్కప్పుడు గుణహీనుడయిన పురుషుడు గూడా గుణముల, గుణవంతుల సాహచర్యముతో ప్రకాశిస్తూనే ఉంటాడు. పాదపములు వేళ్ళతో నీటిని త్రాగి అనేక రూపములను ధరించెను. ఎండలకు ఎండి, అలిసి ఇప్పుడు విశ్రమించినవి ఆచెట్లు. పొదుగుల భారముతో ఆవులు మెల్లమెల్లగా నడుస్తూ, శ్రీకృష్ణుడు పిలువగనే ఆనందంతో పొదుగు చేపగా, వడివడిగా గోపాలుని వద్దకు చేరుకొనెను ఇవి భాగవతము దశమస్కంధములో వర్షావర్ణనము. ఈ వర్షముతో గొల్లపిల్లలను వెంటపెట్టుకొని చెట్టుచెట్టూతిరుగాడుతూ, బావిగట్టునో, చెరువుగట్టునో కూర్చొని కమ్మకమ్మగా పెరుగన్నము ముద్దలు తిన్నాడట. ఇది అతి మధురవర్ణనము అయితే వర్షాన్ని సగుణబ్రహ్మముతో ఆపక్వయోగి చిత్తముతో, గుణహీనునితో, భక్తుల మనస్సులతో క్షీణించి సందిగ్ధస్థితిలో ఉన్న వేదములతో పోల్చడం భాగవతము ప్రధానంగా తత్త్వశాస్త్రగ్రంథమని నిరూపిస్తున్నది. ప్రకృతి వర్ణనాన్ని ప్రస్తుత వస్తువర్ణనంతో జోడించడము చాలా గొప్పశిల్పము. వ్యాసుడిందు అందె వేసినచేయి.

## శరద్వర్ణనము

"శరదా నీరజోత్పత్త్యా నీరాణి ప్రకృతిం యయుః,  
భ్రష్టానామివ చేతాంసి పునర్యోగ నిషేవయా.  
సర్వస్వం జలదాహిత్వా విరేజుః శుభ్రవర్చసః,  
యథా త్యక్తైషణాః శాంతామునయో ముక్తకిల్బిషాః.  
గిరయో ముముచు స్తోయం క్వచిన్న ముముచుః శివమ్,  
యథా జ్ఞానామృతం కాలే జ్ఞానినో దదతేనవా.  
నైవావిదన్ క్షీయమాణం జలం గాధజలేచరాః  
యథాయు రన్వహం క్షయ్యం నరామూఢాకుటుంబినః.  
కేదారేభ్య స్త్వ పోఽగృహ్ణన్ కర్షకా దృఢ సేతుభిః,  
యథా ప్రాణైః స్రవజ్ జ్ఞానం తన్నిరోధేన యోగినః.  
శరదర్కాంశుజాంస్తాపాన్ భూతానా ముడు పోఽహరత్,

దేహాభిమానజం బోధోముకుందో వ్రజయోషితామ్.
ఖమశోభత నిర్మేఘం శరద్విమల తారకమ్,
సత్త్వయుక్తం యథాచిత్తం శబ్ద బ్రహ్మార్థ దర్శనమ్.
అఖండమండలో వ్యోమ్ని రరాజోడు గణైః శశీ,
యథా యదుపతిః కృష్ణో వృష్ణి చక్రావృతో భువి.
ఆశ్లిష్య సమశీతోష్ణం ప్రసూన వనమారుతమ్,
జనస్తాపం జహుర్గోప్యో న కృష్ణహృత చేతసః.''

శరదృతువు వచ్చింది. సరోవరాల్లో కమలాలు పుష్పించసాగినయి. భ్రష్టుడయినవాడు తిరిగి యోగాన్ని సాధించి మనస్సును స్తిమితపరచుకొన్నట్లు నీరు స్తిమితము కాసాగింది. వర్షాకాలంలో ఉండే బుడగలు, ఒడుదుడుకులు, నురగలు, వరదలు నీటికి లేవిప్పుడు మేఘాలు తమ సర్వస్వమయిన జలాన్ని వర్షించి స్వచ్ఛంగా, ప్రకాశిస్తూ దూదిపింజలవలె తేలిపోసాగినవి. కోరికలను త్యజించి, మాలిన్యమును కడిగివేసిన మునుల మనస్సులు గూడా ఈమేఘాలవలెనే స్వచ్ఛంగా, నిశ్చింతగా ఉన్నాయి.

కొండలనుండి ఒక్కొక్కచోట నీరు స్రవిస్తూఉంది. మరొకచోటలేదు జ్ఞానులు జ్ఞానామృతాన్ని శిష్యులకొకచోట పంచుతూ మరొకసారి పంచక ఊరకే ఉంటారుకదా! చిన్నచిన్న గుంటలలో, వాగులలో ఉండే నీరు క్రమంగా ఇంకిపోసాగింది. వర్షర్తువులో వలె నిండానీరు ఉండడము అసంభవముకదా! ఈస్థితిని ఆ జలాశయాలలో ఉండే మూఢ జలచరాలు గమనించ లేకపోయినవి. మూఢులైన సంసారులు కూడా వాటివలెనే రోజు రోజుకూ క్షీణించే ఆయుర్దాయాన్ని గ్రహించలేరు. గట్టుకట్టి వరిమళ్ళలోనికి నీటిని మళ్ళించి, నిలబెడుతున్నారు. కర్షకులు ప్రాణవాయువును నిరోధించి యోగి జ్ఞాన సాధనను చేసినట్లే, ఈ కర్షకులు గూడా తగిన ప్రయత్నాన్ని చేస్తున్నారు శరత్కాలంలో ఎండతీక్ష్ణంగా ఉంటుంది. ఆ ఎండవేకిమిని చంద్ర కిరణాలు హరించివేస్తున్నవి. ముకుందుడు గోపికల దేహాభిమానజమైన తాపాన్నీ అట్లే హరించివేసినాడు. దేహాభిమానము మిగిలి ఉన్నంత కాలము భక్తుడు తనసర్వస్వాన్ని భగవంతునికి అర్పించలేడు. అందుకే ఆగోపికలకీ పరీక్ష. శరత్కాలంలో మేఘాలు తొలగిపోయి. స్వచ్ఛంగా ప్రకాశించే నక్షత్రాలతో ఆకాశము సుందరంగా కనబడింది. ఆ ఆకాశము శబ్ద బ్రహ్మార్థ దర్శనమైన

సాత్త్వికభావయుక్తమయిన చిత్తములవలె నిర్మలంగా ఉన్నది. గొల్లపిల్లలు శ్రీకృష్ణుని చుట్టువేయగా వారిమధ్యలోనతడు నక్షత్రాలమధ్య అఖండమండలాకారముతో ప్రకాశించే చంద్రునివలె ఒప్పెనట. ఈ ఋతువులో గాలి పూదోట మీదనుండి వీస్తూ, సుగంధాన్ని వెదజల్లుతూ సమశీతోష్ణమైనది. ఆవిధమైనగాలిని కౌగిలించుకొని జనులు తాపాన్ని తొలగించుకొనిరి. గాని శ్రీకృష్ణుడినే ధ్యానించే గోపికల తాపము మాత్రము తగ్గదాయెను.

ఈ శరద్వర్ణనము గూడా వర్షావర్ణనమువలెనే యోగులను,తపస్సు,తత్త్వాన్ని వర్ణించి చెప్పడానికే వినియోగమైన తీరు గంభీరము.

## వేణుగానము

"బర్హాపీడం నటవరవపుః కర్ణయోః కర్ణికారం
బిభ్రద్వాసః కనక కపిశం వైజయంతీం చ మాలాం,
రంధ్రాన్వేణోరధరసుధయా పూరయన్ గోపవృందైః
వృందారణ్యం స్వపదరమణం ప్రావిశద్గీత కీర్తిః"
ధన్యాః స్మ మూఢమతయేఽపి హరిణ్య ఏతా
యానంద నందన ముపాత్తవిచిత్రవేషమ్
ఆకర్ణ్య వేణురణితం సహకృష్ణసారాః
పూజాం దధుర్విరచితాం ప్రణయావలోకైః

శరత్కాలంలో నటవరవేషధారి అయిన శ్రీకృష్ణుడు నెమిలిపింఛాన్ని ధరించి చెవిలో కర్ణికారాన్ని తురిమి, పచ్చలి చేలాన్నిధరించి, వైజయంతీమాల కంఠసీమ నలకరించగా తన అడుగులతో రమించే వృందారణ్యాన్ని ప్రవేశించి వేణుగానము నారంభించెనట. దామోదరుని మోవిని తాకిన వేణువెంత ధన్యము వేణువురంధ్రాలను తన అధరామృతంతో నింపెనుగదా కృష్ణుడు. ఆవేణుగానానికి ప్రకృతి అంతా పరవశించిపోయింది. జింకలకు గానమంటే ప్రీతి ఎక్కువ మూఢమతులైన ఆడజింకలు గూడా తమ ప్రియులైన కృష్ణసారములు సాహచర్యముతో ఆనందాన్ననుభవించి విచిత్ర వేషాన్ని ధరించిన శ్రీకృష్ణుడిని చూస్తూ అతని వేణుగానాన్ని వింటూ ప్రణయదృష్టిని పరమాత్మని పైకి సారింప జేస్తూ అతనిని మనసార పూజించెను.గోవులుగూడా కర్ణపుటాలను నిక్కించి కృష్ణముఖము,

నుంచి ప్రవహించే వేణురవామృతాన్ని పానం చేసినవి. చెట్లకొమ్మలమీదినుండి పక్షులు పిసులు కన్నురెప్పవేయ కుండా శ్రీకృష్ణుని చూస్తూ ఇతర విషయాల నన్నింటిని విడిచిపెట్టి వేణు గానాన్ని విన్నారట. నదుల లోనికి దిగి కృష్ణుడు వేణు గానాన్ని చేస్తూ ఉంటే ఆ నదులు గూడా ఆపరాని తమకముతో అలలనే బాహువులతో ఆతని పాదాలను పట్టుకొని కమలాలనే ఉపహారాలను అర్పించినవట. ఇది వేణుగానములోని అలౌకికమాధుర్యము. లీలాశుకుడు "కృష్ణకర్ణామృతి" కావ్యాన్ని రచించి సహృదయులకమృతాన్ని పంచిపెట్టినాడు.

"కస్తూరీ తిలకం లలాటఫలకే" వంటి ప్రసిద్ధ శ్లోకాలు కృష్ణకర్ణామృతము లోనివే. వేణుగానమాధుర్యాన్ని మధురతరంగా వర్ణించినవాడతడు.

"కమనీయ కిశోరముగ్ధమూర్తేః కలవేణుక్వణితా దృతాననేందోః
మమవాచి విజృంభతాం మురారే ర్మధురిమ్ణః కణికాపికా పికాపి.

బాలకృష్ణుని కిశోరముగ్ధమూర్తి కమనీయము. అతని ముఖకమలము వేణువు యొక్క కలనాదాన్ని (అవ్యక్త మధురరవాన్ని) ఆదరించినది. అతని మోవి తాకగానే వేణు నాదానికెంత మాధుర్యం వచ్చిందో? ఆ మాధుర్యంలోని ఒక్క కణిక, ఒకే ఒక కణిక, ఏదో ఒక పిసరంత అంశము తన కవిత్వంలో కలిసి దాన్ని రసవంతం చేయాలని కవికోరుకున్నాడు. కణిక ఎందుకు వేణుగాన సారాన్నే తనదిగా చేసుకున్న మధురకవిత అది. ధన్యుడా లీలాశుకుడు. శ్రీకృష్ణుడు కేవలము గోపినందనుడా? కానేకాదు దేహులందరి అంతరాత్మ, అంతర్యామి. ఈ కృష్ణతత్త్వాన్ని బాగాఎరిగిన గోపికలు నిజమైనభక్తులు. గోపికాగీతరసనిష్యంద మైన మధురకవిత. ఒకటి రెండు శ్లోకాలను మాత్రమిక్కడ ఉదహరిస్తాను.

తవ కథామృతం తప్త జీవనం
కవిభిరీడితం కల్మషాపహమ్.
శ్రవణమంగలం శ్రీమదాతతం,
భువి గృణంతి తే భూరిదా జనాః.
చలసి యద్ వ్రజాచ్చారయన్ పశూన్,
నలిన సుందరం నాథ తే పదమ్.

శిలతృణాంకు ర్తైః సీదతీతినః,
కలిలతాం మనః కాంత గచ్ఛతి.

అటతి యద్భవానాహ్ని కాననం,
త్రుటి యుగాయతే త్వామ పశ్యతామ్.

కుటిల కుతలం శ్రీముఖంచతే,
జడ ఉదీక్షతాం పక్ష్మకృద్ దృశామ్.

కృష్ణా నీ కథ సంసార దుఃఖమునుండి విముక్తిని కలిగించే అమృతము. సకల కల్మషాలను పోగొట్టేది-చెవుల కింపైనది; కవులచేత గానంచేయబడినది. ప్రజలంతా శ్రీమంతమైన ఆ కథామృతాన్ని గానంచేసి ధన్యులవుతున్నారు, నీవు గోవులను తోలుతూ వ్రజ భూములలో తిరుగుతూఉంటే, మామనస్సులకెంత బాధ కలుగుతుందో తెలుసా? నీపాదము తామరపూవు వలె మెత్తనిది. ఈ అడవిలోని గండశిలలు, గడ్డిగాదము నీపాదాలకు గ్రుచ్చుకొని బాధపెడుతుందని మేమెంత బాధపడతామో తెలుసా? పగలంతా నీవు అడవిలో తిరుగుతూఉంటే నిన్నుచూడని మాకు క్షణమొక యుగంగా గడుస్తుంది. కుటిల కుంతలముల (నొక్కు నొక్కుల జుట్టు)తో శ్రీమంతమైన నీ ముఖారవిందాన్ని చూడ డానికీ కనురెప్పలొకటి అడ్డు వచ్చి పడ్డాయి.

ఈవిధంగా గోపికలు ఏడుస్తూ ఉంటే వారిముందు మన్మథ మన్మథుడు పీతాంబరుడు వనమాలాధారి చిరునవ్వు నొలకిస్తూ ప్రత్యక్షమైనాడట.

కృష్ణ నారాయణం వందే కృష్ణం వందే వ్రజప్రియమ్,
కృష్ణం ద్వైపాయనం వందే కృష్ణం వందే పృథాసుతమ్,

విష్ణురూపుడైన కృష్ణునకు వ్రజభూములలోని జనులకు ప్రియతముడైన కృష్ణునకు ద్వైపాయనుడయిన కృష్ణునకు కుంతి(పృథ) సంతానమయిన కృష్ణునికి నమస్కారము. కథానాయకుడు కృష్ణుడే, కథ చెప్పేవ్యాసమహర్షీ కృష్ణుడే. గీతా కారుడు కృష్ణుడే. గీతోపదేశామృతాన్ని అస్వాదించిన అర్జునుడు కృష్ణుడే. "సర్వం కృష్ణమయం జగత్" అని తోస్తుంది.

అవధూత లక్షణాలు

"జనేషు దహ్యేనేషు కామలోభదవాగ్నినా
న తప్యస్నేగ్నినా ముక్తో గంగాంభస్థ ఇవ ద్విపః" (ఉద్ధవగీత)

కామము, లోభములనేవి కార్చిచ్చులవంటివి. అవి జనులనందరిని దహించి వేస్తూనే ఉంటవి. ఇంద్రాదులు కూడా వీటికి అతీతులుకారు. కాని అవధూత మాత్రము ఈ చిచ్చులో దహనము కాకుండా నిమ్మకు నీరెత్తినట్లుండ గలడు. గంగానది జలములోనికిదిగి క్రీడించే ఏనుగుకు ఎక్కడైనా నిప్పంటుకుంటుందా.

ఇక్కడ జనకమహారాజుకథ గుర్తుకు వస్తుంది. మిథిలానగరానికి నిప్పంటుకుందని జనము గగ్గోలుపడిపోతుండగా తనకేమి పట్టనట్లు గురూపదేశాన్ని వింటూ కూర్చున్నాడట జనకుడు. అంతకన్న జ్ఞాని ఎవడు? చూడండి.

"మిథిలాయాం ప్రదీప్తాయాం నమే దహతి కించన"

అవధూత అంటే శరీరంమీద ఎట్టిమమకారము లేనివాడు. బంగారాన్ని మట్టిని సమానంగా చూసేవాడూ, గొప్పజ్ఞానీ, అనిఅర్థము. వ్యాసభగవానుని కొడుకు శుకమహర్షి. భాగవత పురాణాన్ని చెప్పినవాడు ఇతడు. వివస్త్రులై జల క్రీడలో ఉన్న స్త్రీలు శుకుడిని చూసి చలించలేదట గాని వ్యాసుని చూసి వెంటనే వస్త్రాలతో శరీరాలను కప్పుకున్నారట. ఇది ఇద్దరికి ఉన్నభేదము. శుకుడు గృహస్థుల ఇండ్లలో గోదోహన కాలముకూడా అంటే ఆవుని పిదికే వరకు ఎంత సేపుపడుతుందో అంతకాలము కూడా నిలిచేవాడు కాదట. చాలా నిరాడంబర జీవి అతడు. అతడు నడుస్తూఉంటే చుట్టూ పిల్లలుచేరి వెంటవచ్చేవారట. శుకుడు పరమహంసయే.

అవధూత లక్షణాలను భాగవతములోని ఏకాదశ స్కంధములోని ఉద్ధవ గీతలో వ్యాసముని వర్ణించి చెప్పెను. శ్రీకృష్ణుడు అవతారమును చాలించే సమయములో ఉద్ధవుడికి చెప్పిన బోధ సారాంశమే ఉద్ధవగీత. ఇక్కడ యదువు అనే ధర్మజ్ఞుడయినరాజు కవి, తరుణుడు, బ్రహ్మణ్యుడు భయము నెరుగనివాడు అయిన అవధూతనిట్లు ప్రశ్నించెను;

"కుతో బుద్ధిరియం బ్రహ్మన్నకర్తుః సువిశారదా,
యామాసాద్యభవల్లోకం విద్వాంశ్చరతి బాలవత్.
ప్రాయో ధర్మార్థ కామేషు వివిత్సాయాం చ మానవాః,
హేతునైవ సమీహంతే ఆయుషో యశసః శ్రియః

త్వంతు కల్పః కవిర్దక్షః సుభగోఽమృతభాషణః,
న కర్తా నేహసే కించిజ్జడోన్మత్త పిశాచవత్,
త్వంహినః పృచ్ఛతాం బ్రహ్మన్నాత్మన్యానందకారణమ్,
బ్రూహి స్పర్శ విహీనస్య భవతః కేవలాత్మనః''

(ఓ మహాత్మా ఇంతటి బుద్ధి వైశారద్యము నీకెక్కడనుండి లభించినది? విద్వాంసుడవైన నీవు ఈశక్తితోనే లోకములో చిన్నపిల్లవానివలె వ్యవహరించ గలుగుతున్నావు. పిల్లవాడు అమాయకంగా స్వచ్ఛమైన మనస్సుతో మెలిగినట్లు నీవు మెలగడమాశ్చర్యకరము. బాలుడైనా నిశ్చింతగా ఉండాలి. లేదా నీవంటి త్రిగుణాతీతునకయినా అదిసాధ్యము కావాలి. నీవీస్థితినెట్లు చేరుకొన గలిగితివి? లోకంలో మానవులు ధర్మార్థకామములను సేవించే విషయంలోగాని, ఆత్మజిజ్ఞాసలో గాని ఏదోఒక ప్రయోజనాన్ని దృష్టిలో పెట్టుకొనే ప్రయత్నం చేస్తుంటారు. ఆయుష్యము, యశస్సు, ధనము అభివృద్ధిచెందాలనే కోరికతో వారు త్రివర్గ సాధన కొరకు పాటుబడుతూ ఉంటారు. కాని నీవు కవివి, దక్షుడవు, సుభగుడవు (అంగ సౌష్ఠవమున్నవాడవు), అమృత భాషణుడవు, అయినప్పటికినీ, నీవే పనిని స్వయంగా చేయవు, చేయాలనే కోరికగూడా నీలో ఉండదు. జడునివలె, పిచ్చివాని వలె, పిశాచమువలె నీవు ఏమీపట్టించుకోకుండా ఎట్లుండగలుగుతున్నావు? ఆత్మా రామునిలో నీవు సదా రమించగల్గడానికి కారణమేమిటి? చెప్పు. నీవేవిధంగా ఏకాంత జీవనాన్ని గడుపగల్గుతున్నావు? ఏరీతిన నీవింద్రియాలను విషయాలనుండి మరలించి వాటిస్పర్శను పరిహరిస్తున్నావు? చెప్పగలవు.)

ఈప్రశ్నకు సమాధానమేమి వచ్చిఉంటుంది? నేను గొప్పయోగాన్ని సాధించానని అవధూత చెబుతాడా? లేక స్వర్గలోకంనుంచి ఒకదివ్యపుష్పాన్ని ఒక అగ్నిహోత్రాన్ని తెచ్చి దాని మహిమతో ఇంతసాధించితినని చెబుతాడా? చూద్దాము.

అవధూత సమాధాన మిది

"పృథివీ వాయురాకాశ మాపోఽగ్నిశ్చంద్రమా రవిః
కపోతోఽజగరః సింధుః పతంగో మధుకృద్గజః
మధుహా హరిణో మీనః పింగలా కురరోఽర్భకః
కుమారీ శరకృత్ సర్ప ఊర్ణనాభిః సుపేశకృత్
ఏతేమే గురవో రాజన్ చతుర్వింశతి రాశ్రితాః''

ఇంత గొప్ప ఆధ్యాత్మిక పదాన్ని చేసుకోవడానికి అవధూత చేసిన సాధన ఎట్టిది? ఈ ప్రశ్నకు సమాధానము చెప్పితే చాలు ఆయనకు ఇరువదినాలుగు మంది గురువులున్నారు. వీరెవరు? తీర్థకరులా: కాదు. వారెవరో చూద్దాము. భూమి గాలి, ఆకాశము, నీరు, అగ్ని, ఇవి పంచభూతాలు. సూర్యుడు, చంద్రుడు వీరు లోకసాక్షులు ఈ ఏడుగురు గురువులు కావడం సహజము వీరుగాక పావురము కొండచిలువ, సింధువు, పతంగము, తేనెటీగ, ఏనుగు, తేనెతెట్టను గొట్టి తేనెను సంపాదించేవాడు జింక, చేప, పింగళ అనేవేశ్య, కురరము అర్భకుడు (పిల్లవాడు), కుమారి (కన్య) శరకృత్ (బాణాలను తయారు చేసేవారు) సర్పము, సాలెపురుగు భ్రమరకీటమూ—ఇవన్నీ గురువులేనట అవధూతకు.

1. భూమి-భూమాతను ఓర్పుకు, సహనరూపముగా చూస్తున్నాము ధీరుడు భూమి వద్ద నేర్చుకోవలసినది సహనము జీవితములో మననెదిరించే వారు గూడా దైవోపహతులే కాబట్టి వారెదిరించినప్పుడు గూడా తన మార్గము నుండి వైదొలగనివాడు ధీరుడు. అతడే స్థితప్రజ్ఞుడు అట్లే చెట్లనుండి పర్వతముల నుండి నేర్చుకోవలసిన విద్య ఇతరుల కొరకే జీవించడము సర్వస్వాన్ని అర్పించడమూ అనేది.

2. గాలి :- యోగి అన్ని విషయములలో తిరుగుచూ, ప్రపంచము లోని ఏ వస్తువును అంటి పెట్టుకొని ఉండడు. గంధవహుడయిన గాలి గూడా అంతేగదా! సుగంధదుర్గంధాదులు గాలికి అంటవు.

3. ఆకాశము :- ఆకాశము పంచ మహాభూతములలో గూడ సూక్ష్మతమము విభువు, అవిభక్తము ఈతత్త్వము సర్వవ్యాపి ఆకాశము వంటిదే ఆత్మ అని యోగి తెలిసికొని ఆత్మానుసంధానమునకు ప్రయత్నించవలెను. ఆత్మగూడా స్థావర జంగమాలలో అంటే కదలిక ఉన్న వానిలో లేనివానిలో అంతర్హితమయి ఉంటుంది. ఆకాశము సర్వవ్యాపి అయిఉండిగూడా నిస్సంగముగా దేనిని అంటిపెట్టుకొనకుండా, దేనికి అందకుండా ఉంటుంది. అదే గుణమున్న ఆత్మను తెలియజేయు గురువు ఆకాశము.

4. నీరు :- నీరు స్వచ్ఛము ప్రకృత్యాస్నిగ్ధము, మధురము మానవులను తన దర్శన స్పర్శన, కీర్తనాదులతో పునీతము చేయునది. ఈ నీటి పవిత్రతను గుర్తించిన జాతి గనుకనే భరతజాతి ఆసేతు శీతనగము తీర్థ

యా[త్రాస్థానాల నేర్పరచుకొన్నది. అట్లేముని గూడా నీటికి మిత్రుడై నీటిని గురువుగా భావించి ఎదుటి వారిని పునీతులను చేయును.

5. అగ్ని:తేజస్వి తపస్సు చేత దీప్తిమంతుడు దుర్ధర్షుడు (ఎదుటి వారు కించ పరచలేరగ్నిని). కడుపేభాజనంగా అంటే గిన్నెగాపెట్టుకొని సర్వమును భక్షించేవాడు అయినప్పటికినీ ఎట్టిమలమూ అగ్నికంటుకొనదు. అగ్నివలెనే ముని వృత్తినవలంబించిన వాడు తేజస్వి దుర్ధర్షుడు ఆకలి తీర్చుకోవడానికి సామగ్రిని గాని, సాధనాలను గాని కూర్చుకొనక కడుపులో పట్టినంత తినే వాడు అంతకుమించి దాచుకొననివాడు, అన్నీ అనుభవిస్తూ గూడా ఏ మలము అంటనివాడు అనగా బొగ్గుల వ్యాపారము చేస్తూగూడా చేతులు నల్లబడని వాడు. ఈవిషయములో అగ్నియే అవధూతకు గురువు. ఒక్కొకప్పుడగ్ని అదృశ్యరూపములో మరొకసారి కంటికి కనిపించే రూపములో మనుష్యుల చేత పూజల నందుకుంటుంది, అదృశ్యరూపంలో ఉండే వైతానికాగ్నులు సమిధల కొరకు అడవికి పోయి తిరిగివచ్చేమునులను తపోవన [ప్రాంగణ ములో ఎదుర్కొంటాయి. అని కాళిదాస మహాకవి రఘువంశకావ్యములో చెప్పెను చూడండి.

"పూర్యమాణ మదృశ్యాగ్ని [ప్రత్యుద్యాతై స్తపస్విభిః" 1-49

ఉన్మత్తునివలె కనిపించే యోగిలోని జ్ఞానము గూడా నివురుగప్పిన నిప్పు వంటిదే. అగ్నిలో ఆహుతి సమర్పించిన దాతలకు అరిష్టములన్నీ నశించి పోతాయి ఇదివరలో ఉన్నవి, ఇకముందు జరుగబోయే అశుభాలనన్నిటినీ అగ్నితుడిచి పెడు తుంది. అదే విధంగా దాతలు ఎవరైనా మునులకు దానంచేస్తే ఆదాన ఫలముగా వారి అరిష్టములన్నీ నశించిపోతవి.

6. చంద్రుడు :- కాలగతి అవ్యక్తము. చంద్రుని కళలు మారుతూ ఉన్నట్లే దేహము జన్మకాలము నుండి, శ్మశానము చేరే వరకు మారుతూనే ఉంటుందిగాని ఈ మార్పులతో ఆత్మకు [ప్రమేయము లేదని తెలిసికొన వలెను. ఈ రూపంలో చంద్రుడు అవధూతకు గురువు.

7. సూర్యుడు :- సూర్యుడు వేయి కిరణాలతో భూమి మీద నుండి నీటిని [గహించి (పీల్చి) తిరిగి ఆనీటిని వర్షరూపములో భూమి మీద వర్షింప జేస్తాడు

"సహస్ర గుణముత్స్రష్టు మాదత్తే హి రసం రవిః" అని రఘువంశ
దే మాటను చెబుతున్నది. ఆ నీటిపై సూర్యునకెట్టి మమకారమూ ఉండదు.
స్తేయోగి ఇంద్రియాములద్వారా ఇంద్రియార్థములను గ్రహించి తిరిగి అవసరము
గినప్పుడు వానిని ఇతరుల ప్రయోజనము కొరకే వినియోగిస్తాడు.

8. కపోతము-పావురము : ఎవ్వరితోనూ అతిగా స్నేహమును గాని, అతి ప్రసంగమును గాని చేయరాదు. దాని పర్యవసానము సంతాపమే. అట్టి అనుభవమే పావురానికి కలిగింది. ఒక పావురాలజంట అన్యోన్య ప్రేమై కజీవులై తమ పిల్లలను పోషించుకుంటూ ఉండగా ఒకనాడు పిల్లపక్షులు బోయవాని వలలో చిక్కుకొనెను. వాటిని విడిచిపెట్టలేని ఆడపావురము తన సంసారము అంతా నశించిపోతుందన్న ఖేదముతో మగపావురము వలలో పడిపోయి నశించింది. సంసారమనే వలగూడ ఇట్టిదే. ఒకరికొరకు వేరొకరు ఇందులో ఇరుకుకొని పోతుంటారు. మిగిలేది దుఃఖము, బంధమే. ఈ పావురము ఉదాహరణము. వ్యతిరేకరీతిలో గురువు, పావురము లాగాఉండవద్దు అనేదు ఇక్కడ నీతి.

9. అజగరము-కొండచిలువ: అజగరము తానున్నచోటికి ఎటువంటి ఆహారము వచ్చి అందుబాటులో ఉంటే అదే,ఆహారాన్నితిని తృప్తిపడుతుంది. అదిరుచి కరమైనాసరే, కాకపోయినాసరే, ఎక్కువ ఉన్నా, తక్కువఉన్నా దాని కంతేచాలు. ఆహార విషయంలో ఈ నియమాన్ని పాటించేవాడు. అజగర వృత్తిని అనుసరిస్తాడు. ఈవిషయంలో అజగరము గొప్పగురువు. ఆహారము లభించకుంటే గూడా చాలారోజులు కదలక మెదలక అజగరము వలెనే యోగిపడిఉండాలి. దీని పర్యవసానాన్ని భాగ్యానికి వదిలివేయాలి. అయితే ఓజస్సును బలాన్ని నిలుపుకొని నిద్రను జయించి పరుండి యుండ వలెనాయోగి.

10. సింధువు : అప్పుడతడు ప్రసన్న గంభీర రూపుడయి సముద్రము వలె ఉండవలెను. యోగిని సముద్రముతో పోల్చి వర్ణించే ఈ శ్లోకాలను చూడండి.

మునిః ప్రసన్న గంభీరో దుర్విగాహ్యో దురత్యయః,
అనంత పారో హ్యక్షోభ్యః స్తిమితోద ఇవార్ణవః,
సమృద్ధకామో హీనో వా నారాయణపరో మునిః,
నోత్సర్పేత న శుష్యేత సరిద్భిరివ సాగరః.

సముద్రము, యోగి ఈ ఉభయులునూ ప్రసన్న గంభీరులు. చాలాలోతైన వారుగాన దుర్విగాహ్యులు వారిని కొలుచుట అశక్యము, దురత్యయులు. అనంత పారులు వారిని దాటివేయుట అసాధ్యము. అక్షోభ్యులు, క్షోభను పొందరు. స్తిమితముగా ఉండేవారు. నారాయణుని యందు భక్తి భావమును నిలిపిన యోగి తన కోరికలు తీరినప్పుడు పొంగిపోడు, లేనప్పుడు శుష్కించడు. అందుకే అతడు సముద్రము వంటివాడు. భగవద్గీతలోని ఈక్రింది సముద్రోపమను గమనింపుడు.

ఆ పూర్యమాణమచల ప్రతిష్ఠం సముద్రమాపః ప్రవిశంతి యద్వత్,
తద్వత్కామా యం ప్రవిశంతి సర్వే సశాంతి మాప్నోతి న కామకామీ.

నలుదిక్కుల నుండి జలప్రవాహములు సముద్రంలో వచ్చిచేరుకున్నప్పటికినీ ఆ సముద్రము మాత్రము ఉత్సర్పణము చేయదు, చలించదు. అట్లే ఎన్ని దిక్కుల నుండి ఎన్నివిధములైన కామవాసనలు యోగి హృదయమును ప్రవేశించినప్పటికి అతడు చలించకుండా ఉన్నందుకే అతనికి శాంతి లభిస్తుంది. "అశాంతస్య కుతః సుఖమ్" అని అన్నారు కదా. శాంతములేని వానికి సౌఖ్యముండదు. అంటే కోరికల వెంట పరుగెత్తే వాడెన్నడూ సుఖపడలేడు అని భావము.

11. పతఙ్గము : ఇంద్రియ నిగ్రహములేని వాడు మాయా స్వరూపిణి అయిన స్త్రీని, ధనమును, ఆభరణములను చూచి ప్రలోభముతో అంధతామిస్రములోపడి నశించును. అగ్నిలోపడి నశించే శలభము గూడా అదే విధంగా సర్వనాశనాన్ని పొందుతున్నది. పతఙ్గాన్ని గురువుగా గ్రహించి పతఙ్గము వలె ఆపదకు లోనుగాకుండా మనుష్యుడు తనను తాను కాపాడుకోవాలి.

12. మధుకృత్-తుమ్మెద:-పుష్పాల నుండి కొద్దికొద్దిగా మధువును పీల్చేతుమ్మెద పువ్వును నలిపివేయకుండా అక్కడ నిలువకుండా ముందుకు కదలిపోతూ తన పనులను నిర్వహిస్తుంది. అందుకే "పదం సహేత భ్రమరస్య పేలవం

శిరీష పుష్పమ్ న పునః పతత్రిణః'' అని అన్నారు. దిరిసెన పువ్వు, అతికోమలము. తుమ్మెదకు మూడు జతల సన్నని కాళ్ళుంటాయి. అందుకే దానిని షట్పదమంటారు. ఆ తుమ్మెద కాళ్ళబరువును శిరీషము సహించ గలదు గాని పెద్దపెద్ద పక్షులు వాలితే పువ్వు నలిగిపోదూ ! తనకు తేనెః దానం చేసిన పుష్పాలను నలిపివేయకుండా, అక్కడే తిష్ఠ వేయ కుండా ఉండే మధుకరము మునికి పెద్ద గురువు. ఇంటింట తిరిగి భిక్షాట నము చేస్తూ కొలదిపాటి భిక్షాన్నముతో తృప్తినొంది గృహస్థులకు కష్టము కలిగించకుండా, జీవించడము మధుకరవృత్తి.

13. గజము :- ఏనుగుల వేటను ఖెడ్డా అని అంటారు. అందులో అడవి ఏనుగును బంధించడానికి మచ్చిక చేసిన ఆడ ఏనుగును ఉపయోగిస్తారు. ఆ ఆడ సాంగత్యములో మరులుకొని ఇంత పెద్ద యూథపతి పట్టుబడతాడు. అందుకే ముని స్త్రీలకు దూరంగా ఉండాలి. స్త్రీల చెక్క ప్రతిమను గూడా స్పృశించరాదు. ఏమో! మనసెప్పుడు కామవాసనలకు లొంగుతోందో ఎవరికెఱుక? చూడండి ఏనుగు ఎంత పెద్ద పాఠాన్ని నేర్పిందో?

14. మధుహా :- తేనెను పోగుచేసేవానిని చూడండి. తేనెటీగలు తాము అనుభవిం చక, ఇతరులకు దానము చేయక కూడబెట్టిన తేనెను, ఒకనాడు ఈ మధుహారి కొట్టుకొని పోతాడు. అతని పాలబడకుండా మనము ధనమును వివేకముతో వినియోగపరచుకోవాలి. వాడు కూడా మనకీవిధంగా గుణ పాఠము నేర్పిస్తున్నాడు.

15. హరిణము :- జింకలను వేటాడేవారు గ్రామ్యగీతములను అడవిలో విని పిస్తారు. ఆ గీతము విని మోహముతో జింక ఒడలు మరచి నిలబడిపోతుంది. అప్పుడు దాన్ని వేటాడం బంధించడము సులభము. జింకలను వేటాడ టానికి అనుసరించే ఈ పద్ధతిని పలువురు కవులు పేర్కొన్నారు. ఇంద్రి యాలను కల్లోలపరిచే గ్రామ్యగీతాన్ని వినకూడదని మనమీజింకలవద్ద నుండి నేర్చుకోవాలి. లేడి సంతానము ఋష్యశృంగమహర్షి అతడు మహాయోగి అయినప్పటికిని అతనిలో హరిణ తత్త్వముండడము వలన స్త్రీల నృత్య, వాదిత్ర గీతాలు విని లొంగిపోయి వారిచేత ఆటబొమ్మగా మారిపోయినాడు.

16. చేప :- జిహ్వాచాపల్యము చాలా చెడ్డది. అన్ని ఇంద్రియ వాసనలు నశించిన వృద్ధాప్యములో గూడా చివరకుమిగిలేది జిహ్వాచాపల్యమూ ఆశా. ఎరకోసము ఎగబడిన చేప జాలరి కొక్కెములో చిక్కుకుంటుంది. ఆహారమును తీసికోకుండా నిగ్రహంగా ఉండేవారు, తదితర ఇంద్రియాలను సులభంగా జయించగల్గుతారు. కాని రసమును, రుచిని మాత్రము జయించలేరు. తిండి మానుకొన్నవారికి జిహ్వాచాపల్య మింకా పెరుగుతుంది. దాన్ని జయించిన వాడే నిజమయిన యోగి. ఈ శ్లోకాలదేవిషయాన్ని బోధిస్తున్నాయి. చూడండి.

॥ ఇంద్రియాణి జయంత్యాశు నిరాహారా మనీషిణః,
వర్జయిత్వాతు రసనం తన్నిరన్నస్య వర్ధతే
తావజ్జితేంద్రియో న స్యాద్విజితాన్యేంద్రియః పుమాన్
న జయేద్రసనం యావజ్జితం సర్వం జితే రసే॥

భగవద్గీత ఇదే మాటను నొక్కి చెప్పుతున్నది. చూడండి,

విషయా వినివర్తంతే నిరాహారస్య దేహినః
రసవర్జం రసో౽ప్యస్య పరం దృష్ట్వా నివర్తతే॥

17. పింగళా :- ఈమె ఒకవేశ్య ఈమెపడుపువృత్తిలో ఉండి ఒకనాడు కాముకులకోసం సింగారించుకొని తలుపు దగ్గర నిలబడి ఎదురు చూచి చూచి రాత్రంతా గడిపివేస్తుంది. ఈ దీర్ఘ నిరీక్షణ వలన ఆమెకు విసుగుపుట్టి ఆ విసుగు నిర్వేదానికి దారితీస్తుంది. తానిదివరలో గడిపిన జీవితముమీద ఆమెకు జుగుప్సకలుగుతుంది. అప్పుడామె గానం చేసిన తత్త్వగీతమిది.

॥ సంతం సమీపే రమణం రతిప్రదం విత్తప్రదం నిత్యమిమం విహాయ,
అకామదం దుఃఖ భయాది శోక-మోహప్రదం తుచ్ఛమహం భజే౽జ్ఞా.॥

( నేను అజ్ఞానముతో ఎల్లప్పుడు నా వద్దనే ఉండి నన్నలరిస్తూ ఉన్న ఆత్మతో రమించక తుచ్ఛుడయిన మనిషిని భజిస్తున్నాను. అతడే కోరికను తీర్చలేడు సరికదా దుఃఖ భయ శోకమోహాలను మాత్రము కలిగిస్తున్నాడు.....

ఈ పింగళాగీతము బౌద్ధసాహిత్యములో కొకొల్లలుగా కనిపించే స్త్రీల ఆర్తనాదాలను, నిర్వేదాన్ని, వైరాగ్యాన్ని తలపింపజేస్తున్నది. తనకిట్టి నిర్వేదాన్ని ప్రసాదించిన భగవంతుని పింగళ ప్రశంసావాక్యాలతో భజించిన తీరు రమ్యమయినది చూడండి.

॥ నూనం మే భగవాన్ప్రీతో విష్ణుః కేనాపి కర్మణా,
నిర్వేదోయం దురాశాయా యన్మే జాతో సుఖావహః

(నేను చేసిన ఏదో ఒక కర్మవల్ల భగవంతునికి ప్రీతి కలిగిఉంటుంది. అందుకే ఇంతటి సుఖకరమయిన నిర్వేదాన్ని నాకు పరాత్పరుడు కలిగించినాడు.)

నిర్వేదాన్ననుభవించిన పింగల అట్లా భావించడంలో అబ్బురమేమున్నది? జీవితమంతా విషయ వాంఛలలో గడిపిన ఆమెకే అట్టి ఆనందము కలిగితే, భగవంతుని మీదనే మనస్సును లగ్నము చేసుకొన్న భక్తులకు ఇంక ఎంత ఆనందము కలగాలి. భాగవత దశమస్కంధములో రామకృష్ణులను చేరబోవు అక్రూరుని ఆనంద మింతింతని వర్ణింపనలవి కానిది అక్రూరుడన్న మాటలివి.

॥ కిం మయాఽఽచరితం భద్రం కిం తప్తం పరమం తపః
కిం వాథాప్యర్హతే దత్తం యద్ద్రక్ష్యామ్యద్య కేశవమ్ ॥

(నేడు నేను శ్రీకృష్ణుని దర్శింతును శ్రీకృష్ణుని దర్శింతును ఈఆనందాన్ని అనుభవించడానికి ఏనెట్టి సత్కార్యమును చేసితినో, ఎంత గొప్ప తపస్సును చేస్తినో అర్హుడయిన వానికేదానం చేశానో, దాని ఫలమిది.)

18. కురరపక్షి:- ఒక కురరపక్షి నోట్లో మాంసపు ముక్కను చూచి తమకది లభించని ఇతర పక్షులు; ఈ పక్షి కన్నా బలవంతులు; దాన్నిపొడిచి హింసించసాగినాయి. ఆ బాధ భరించలేక తన నోట్లోని మాంసాన్ని జారవిడచిన కురరపక్షి అమిత సుఖాన్ని అనుభవించింది. ఈ పక్షిని చూసిన మౌని అది చేసిన త్యాగానికి ముగ్ధుడై ఆ పక్షిని గురువుగా భావించినాడు. "పరిగ్రహో హి దుఃఖాయ" (వస్తుసంపాదనమే దుఃఖ మూలము) అని అని గ్రహించినాడు ఈ మర్మమెరిగిన యోగి సంచయము చేసికొనక అనంత సుఖాన్ని అనుభవిస్తాడు.

19. అర్భకుడు-పిల్లవాడు:-

> ద్వావేవ చింతయా ముక్తౌ పరమానంద ఆప్లుతౌ
> యో విముగ్ధో జడో బాలో యో గుణేభ్యః పరం గతః

చింత మనిషిని పీల్చి పిప్పిచేస్తుంది. చింతలేని దెవరికి? **I ewy no one no one envries my** అని గానం చేసే కార్మికునికి చింతలేదు. కాని అతని గానాన్ని విన్న రాజు మనస్సునిండా చింతయే కార్మికుడెవరిపైన ఈర్ష్యలేక ఆనందంగా ఉండవచ్చును గాని, అతని మట్టికొట్టుకున్న దుస్తులను, ఆ దుస్తులలో మెరిసే ఆనందాన్ని చూసి అతనిపై ఈర్ష్య పడే రాజు ఉండనే ఉన్నాడు కదా! కాబట్టి పరమానందాన్ని పొందడానికి రెండే రెండు మార్గాలు అతడు మూఢుడు, జడుడు, బాలుడు అయి అయినా ఉండాలి. లేదా త్రిగుణా తీతుడయిన, యోగి అయినా కావాలి. ఏ కల్మషమూ, కారణమూ లేకుండా స్వచ్ఛంగా నవ్వగలిగేవాడు చిన్న పిల్లవాడు మాత్రమే. అంతస్వచ్ఛదరహాసము రామకృష్ణ పరమహంస పెదవుల మీదనే తాండవిస్తుంది. మధ్యలో కొట్టు మిట్టాడుతున్న వారికీ భాగ్యము అందని ద్రాక్షపండు.

20. కుమారి :- ఒక కన్యకను చూడడానికి పెళ్ళివారు వచ్చారు. అప్పుడింట్లో ఆమె తప్ప ఎవ్వరూలేరు, వారిని సత్కరించి కూర్చోబెట్టి వారికి అన్నము పెట్టాలని చూస్తే ఇంట్లో వడ్లగింజలు తప్ప, బియ్యపు గింజలు లేవు. ఏమి చేయాలి. ఇప్పుడు వడ్లు దంపి బియ్యంతో అన్నం వండిపెట్టాలి. ఆమె చుట్టాలకు తెలిస్తే అవమానము వాళ్ళకు తెలియకుండా చాటుగా వడ్లు దంపడం ఆమె ఆరంభిస్తుంది. అయితే ఆమె చేతికున్న శంఖపు గాజులు గల గల శబ్దంచేయడం మొదలు పెడతాయి. ఈ సిగ్గుచేటు వ్యవహారము చూసి, రెండు రెండు గాజులు మాత్రముంచుకొని మిగిలినవాని నామె పగలగొట్టివేస్తుంది. ఆ రెండు గాజులు గూడా ఒకదానికొకటి రాచుకొని చప్పుడు చేయగా ఇది పని కాదని, మరొక జత గాజులను గూడా ఆమె పగలగొడుతుంది. ఇంక ఒకే ఒక్కగాజు, చప్పుడెలా చేస్తుంది. నోరు మూసుకొని కూర్చుంటుంది. లోక తత్త్వాన్నీవిధంగా కుమారీకంకణం వల్ల తెలిసికొన్న అవధూత ఈ మాటలనంటున్నాడు.

వాసే బహూనాం కలహో భవేద్వార్తా ద్వయోరపి
ఏక ఏవ చ రేత్తస్మాత్కుమార్యా ఇవ కంకణః॥

జన సమ్మర్ధమున్నచోట గడబిడ, కలహము తప్ప ఇంకేమీ ఉండదు. కుమారి చేతినిండా గాజులున్నప్పుడు గలగల ధ్వని తప్ప ఏమైనా ఉండిందా? ఇద్దరున్న చోట గూడ మాటలుంటూనే ఉంటాయి. రెండు గాజులు గూడ ఒకదాని కొకటి ఒరుసుకుంటూనే ఉన్నాయి కదా! కాబట్టి యోగ సాధన చేయదలచిన వాడేకాంతంగా ఒక్కడే ఉండి గడపాలి. ఒకే ఒక కంకణమెక్కడైనా శబ్దము చేస్తుందా? "నిశ్శబ్దం బ్రహ్మముచ్యతే'' అని కదా అన్నారు. ఈ రవత్వము మనస్సు సచేతనంగా ఉన్నప్పుడు ఆనందాన్ని కలిగిస్తుంది. అదే మనస్సు జడంగా సోమరిగా ఉన్నప్పుడు ఏకాంత స్థితి దుర్భరమౌతుంది.

21. శరకృత్ :- ఇషుకారుడు-బాణాలను తయారు చేసేవాడు; బాణాలను తయారు చేసేవాడు శరము చివరి భాగాన్ని పదును చేసేటప్పుడు ఏకాగ్రంగా ఆ బాణాన్నే చూస్తూ ఉంటాడు. పక్కనుండి పోయే రాజు గూడా అతనికి కనిపించడు ఇక్కడ బాణవిద్య నభ్యసిస్తున్న అర్జునుడు అందరకూ గుర్తుకు రాకమానడు. విద్యా పరీక్ష జరుపుతున్న ద్రోణాచార్యుడు పాండవులను, కౌరవులను ఒక్కొక్కరిని పిలిచి ఎదుట చెట్టు కొమ్మమీద లక్ష్యంగా ఉన్న పండును చూడమన్నాడట. తిరిగి శిష్యుల నుద్దేశించి మీకేమి కనబడుతున్నదో చెప్పమని ప్రశ్నింపగా ధర్మరాజాదులు ఆచార్యుడు. పరిసరాలు, సోదరులు, ఆకాశము, చెట్టుకొమ్మలు, ఆకులు, లక్ష్యమున కిటు అటు ఉండే పండ్లు అన్నీ మాకు కనపడుతున్నవని సమాధాన మిచ్చిరి. అర్జునుడు మాత్రము తనకు లక్ష్యము తప్ప మరేదీ కనిపించడం లేదని అన్నాడట. అదీ ఏకాగ్రత! యోగము. ఇక్కడ స్నిగ్ధ గంభీరమైన వ్యాస సూక్తాన్ని చదువుదామా?

"యస్మిన్ మనో లబ్ధపదం యదేతచ్ఛనైః శనైః ముంచతి కర్మరేణూన్,
సత్త్వేన వృద్ధేన రజస్తమశ్చ విధూయ నిర్వాణ ముపైత్యనింధనమ్''

మనస్సు భగవంతునిలో లగ్నమై, మెల్ల మెల్లగా కర్మరేణువులను విడిల్చి

వేస్తూ ఉంటుంది. ఆ స్థితిలో సత్వ గుణము పైకి వచ్చి రజస్తమో గుణాలను చెరిగివేస్తుంది, పైకి ఎగదోసి మంటచేసే ఇంధనము లేక పోయినందున నిర్వాణాన్ని (ఆర్పివేయుట, శాంతము నొందుట) అనుభ విస్తుంది. ఇది అందరూ కోరదగిన దశ.

22. సర్పము :- మానవుడే ప్రయత్నాన్ని ప్రారంభించినా తాను అమరుడయి నట్లు శాశ్వతంగా ఇక్కడే ఉండి పోతున్నట్లు భావించి చేస్తాడు. అటు వంటి ప్రయత్నాలలో ఇల్లు కట్టడమొకటి "ఇల్లు కట్టిచూడు, పెండ్లిచూసి చూడు" అని ఊరకే అన్నారా? ఇల్లు కడితే, కట్టేటప్పటి నుంచి, అన్నీ బాధలే. "చీమలు పెట్టిన పుట్టలు పాములకిరవైన యట్లు గదరా సుమతీ" అని సుమతి శతకకారుడన్న మాటలకు మూలము వ్యాస సూక్త ములో ఉన్నది.

> "గృహారంభో హి దుఃఖాయ విఫలశ్చా ధ్రువాత్మనః
> సర్పః పరకృతం వేశ్మ ప్రవిశ్య సుఖమేధతే."

తానీ దేహమనే ఇంట్లో ఉండే వెన్నాళ్ళో తెలియదు. శాశ్వత గృహము నిర్మించి దుఃఖ పడటమెందుకు? సర్పాన్ని చూడండి, హాయిగా చీమలు పెట్టిన పుట్టలలోనో, ఎలుకలు తొవ్విన కన్నాలలోనో తల దాచుకొని ఇల్లు కట్టడానికి ఎక్కువ శ్రమ పడవద్దని మనిషికి బోధచేస్తున్నవి. పై శ్లోకముద్ధవగీతతో బాటు శాంతి పర్వంలో గూడా కనిపిస్తుంది.

23. ఊర్ణనాభి :- సాలెపురుగు:-నారాయణుడొక్కడే తాను సృష్టించిన ఈ జగత్తును తిరిగి తన మాయచేత తన లోపలికి లీనము చేసుకుంటాడు. అతడు అద్వితీయుడు. లోకానికంతటికినీ ఆశ్రయభూతుడయి. తన ఆధారము మీదనే తాను నిలిచినవాడు. తన శక్తిచేతనే సత్వరజస్తమో గుణాలను కాలానుగుణ్యముగా సామ్యముతో ఉంచి, ప్రకృతి పురుష తత్త్వాలకు ఈశ్వరుడయిన వాడు, పెద్ద చిన్న అందరకూ ప్రభు వతడు. ఎట్టి ఉపాధులు లేనివాడు. కేవలానుభవము అనే ఆనంద రూపబ్రహ్మ అతడు త్రిగుణాత్మకమైన మాయను తన శక్తితో క్షోభింపజేసి సృష్టిని జరుపుతాడు. మూల ప్రకృతి ఈ విధంగా సృష్టిరూపములో విశ్వతో

ముఖంగా వ్యక్తమవుతుంది. ఈ సృష్టిలోనే విశ్వమంతా విస్తరిల్లుతున్నది. జీవులు జన్మల నెత్తుతున్నారు.

ఈ సృష్టి క్రమమునకు తెలిసేదెట్లా? సాలెపురుగును చూడండి. తెల్లమవుతుంది.

"యథోర్ణనాభిర్హృదయా దూర్ణాం సంతత్య వక్త్రతః
తయా విహృత్య భూయస్తాం గ్రసత్యేవం మహేశ్వరః''

సాలెపురుగు తన ఎదలోనుండి నోటిద్వారా ఊర్ణను (ఉన్నివంటి దారాన్ని) వడకుతూపోయి విస్తరింపజేస్తుంది. దానితో కొంచెము సేపాడుకొని తిరిగి ఆధారాన్ని మింగివేస్తుంది. నారాయణుని లీలలు గూడా ఈసాలె పురుగు లీలలవంటివే కాబట్టి సాలెపురుగు ఈ మాయాజాలాన్ని అర్థం చేసుకోవడంలో చాలా గొప్పగురువు. దానికే నోరుంటే ఇంకా ఎన్ని చెప్పగలిగేదో మనిషికి మూల తత్త్వమంత తేలికగా అర్థము కాగూడదని కాబోలు భగవంతుడీ మూగజీవులను కేవలము సంకేతార్థమే సృష్టించి నాడు సాలెపురుగు అల్లిన దారము గూడా పెద్దసాలెపురుగు (భగవంతుడు) జాలములోని భాగమే కదా!

24 సుపేశకృత్ :- భ్రమరకీటము-సీతాకోక చిలుక.

"యత్ర యత్ర మనో దేహీ ధారయేత్సకలం ధియా,
స్నేహాద్ద్వేషాద్భయాద్వాపి యాతి తత్తత్సరూపతామ్.

దేహమును ధరించిన వాడు దేహి. అతడు ఎక్కడెక్కడ తన మనస్సు నంతనూ ప్రేమతోనో, ద్వేషముతోనో, భయముతోనో, కేంద్రీకృతము చేస్తాడో ఆయా రూపాలను ధరిస్తాడు. ఈ సూత్రాన్ని మనోవైజ్ఞానికులు గూడా అంగీకరించినారు. ఇది భ్రమరకీటన్యాయము. కీటము, అనగా గొంగళి పురుగు గోడలో ప్రవేశింపబడి తనను బంధించిన పేశకృత్‌ను ధ్యానము చేస్తూ చేస్తూ చివరకు ఆపేశకృత్ గానే మారి పోతుంది. అయితే స్వరూపాన్ని వదలకుండా కొత్త రూపాన్ని ఆపాదించు కొంటుంది. జీవి మరణించే సమయంలో బ్రాహ్మీస్థితిలో దేన్ని గూర్చి గాఢంగా ధ్యానిస్తాడో, అదే రూపాన్ని అతడు పొందుతాడనే సిద్ధాంతము గూడా దీనిపైననే ఆధారపడింది.

ఈ గురువులను గ్రహించడములో ఆంతర్యమేమి? ఋషులు ప్రకృతి నెంత సూక్ష్మంగా పరిశీలించినారో ఇక్కడ స్పష్టము. ప్రకృతి మాత లాలించి పెంచితే, పెరిగిన బిడ్డలకే ఈ క్రాంత దర్శనమేర్పడుతుంది. ఒక సాలెపురుగును చూచి, పరిశీలించి వారు తెలిసికొనగలినంత, ఎన్ని పుస్తకములు చదివి మాత్రము తెలిసికొంటారా? తల్లి, తండ్రి, గురువు, దైవము అంతా ప్రకృతే వారికి, ప్రకృతి వారితో పాటు నవ్వింది. ఏడ్చింది. ఎండుటాకుల రూపంలో కన్నీరు రాల్చింది. పండువెన్నెల రూపంలో ఆనందాన్ననుభవించింది. కోయిలల రూపంలో గానం చేసింది. కిల కిలా నవ్వింది. కోపంతో ఉరిమింది. ఆశ్చర్యంతో మెరిసింది. ఊరు ఏలే రాజు దుఃఖపడుతూ ఉంటే మామిడిపూత ఎట్లా ఫలిస్తుంది? అరవిసిన మొగ్గ పూర్తిగా ఎందుకు వికసిస్తుంది. కోయిల ఎందుకు పలుకుతుంది? ఇది నాటి భారతీయసాహిత్యంలో కనిపించే క్రాంత దర్శనము కవిత్వము, తత్త్వము సమఉజ్జీలుగా వెల్లివిరిసిన సంస్కృతి అది.

> దేహో గురుర్మమ విరక్తి వివేక హేతు
>
> ర్బిభ్రత్స్మ సత్త్వ నిధనం సతతార్త్యుదర్కమ్.
>
> తత్త్వాన్యనేన విమృగశామి యథా తథాపి
>
> పారక్యమిత్యవసితో విచరామ్య సఙ్గః''

ఇరువది నాలుగు మంది గురువుల దగ్గర నేర్చుకున్న విద్య అంతా ఒక ఎత్తు. తన శరీరాన్ని చూచి తాను నేర్చుకునేది, మరొక ఎత్తు. దేహమే అవధూతకు పెద్ద గురువు. ముక్తికి కూపమయిన ఈ దేహాన్ని పరికించి చూచిన జ్ఞానికి విరక్తి తప్పకుండా కలుగుతుంది. విరక్తివల్ల అసంగము నిస్సంగత్వము వల్ల సమ్యగ్దర్శనము మంచి చెడ్డల వివేకము కలుగుతుంది. స్వార్థమే వివేకాన్ని తొలగించే పొర చావు పుట్టుకలకు హేతువీ దేహము. దీని నిండా ఆపదలు, కష్టాలే, కాని దేహమనే కరణముండ బట్టే సత్యాన్వేషణ జరుగే అవకాశము ఏర్పడుతుంది. దేహ వాసి అయిన జ్ఞానికే విదేహముక్తి సత్యాన్వేషణ వల్ల కలుగుతుంది. అతనికే దేహము తనది కాదన్న నిస్సఙ్గబుద్ధి, నిస్సఙ్గబుద్ధివల్ల నిర్మమత్వము కర్మకౌశలము మనశ్శాంతి మొదలయినవన్నీ ప్రాప్తిస్తాయి.

"లబ్ధ్వాసు దుర్లభమిదం బహు సంభవాంతే
మానుష్య మర్థద మనిత్య మపీహ ధీరః
తూర్ణం యతేత న పతే దనుమృత్యు యావత్''
నిఃశ్రేయసాయ విషయః ఖలు సర్వతః స్యాత్

ఎన్నో జన్మల సాధన ఫలమీ మనుష్య జన్మము, ఇది పొందటం సులభం కాదు. ఇది అనిత్యమూ, నశ్వరమూ అయినా, మోక్షసాధకుని ప్రయోజనాన్ని తీర్చేదీ జన్మనే అందుకే మృత్యువు కబళించి వేయకమునుపే తొందరగా మోక్ష ప్రాప్తికై యత్నము చేయవలెను. విషయ వాంఛలను తీర్చుకోవడమా? అవి పశుపక్ష్యాదుల జన్మలలో కూడా సాధ్యము, నిశ్శ్రేయససాధనయొక్క మనుష్యునికే సాధ్యము ఆహార నిద్రాభయమైథునాలు మనిషితో బాటు, వాటికి గూడా ఉన్నాయి. "ఉద్ధరేదాత్మ నాత్మానం'' (తన ప్రయత్నముతోనే తనను తానుద్ధరించుకోవాలి) అనేది మనుష్యజన్మకే వర్తిస్తుంది.

తనను తానుద్ధరించుకునే ఈ సాధన మార్గములో భక్తి, జ్ఞాన, కర్మ యోగములు-సమాన స్థాయిలో ఉంటాయి సాధకుని ప్రవృత్తి ననుసరించి ఒక్కొక్కరికి, ఒక్కొక్క మార్గము నచ్చుతుంది. పురాణాలన్నీ ఈ భక్తుల కథలనే చెబుతున్నాయి. గోపికలకు శ్రీకృష్ణునిపై భక్తి ఎంతటి దంటే శ్రీకృష్ణుని ప్రతిబింబాన్ని యమునా నదీ జలాలలో చూపించి, అందులో కృష్ణుడున్నాడంటే నిస్సందేహంగా యమునలోకి దూకేవారే వారు. పాలూ, పెరుగూ, వెన్న అమ్ముతూ మధురానగర వీధులలో తన్మయావస్థలో ''గోవింద, దామోదర మాధవా'' అని గానం చేసిన వారిని చూసి, నగరవాసులు విడ్డూరపడలేదా? రోజూ తెచ్చే పాలూ, పెరుగును వీరు తేలేదా? ఏమో? అంతకన్న మధురమయిన కృష్ణ నామాన్ని వీరు స్మరించి లోకులను తరింపజేస్తున్నారు కదా? మధురకవిత సంస్కృతములో పండి, తక్కిన భారతీయ భాషలలో కృష్ణతత్త్వమనే తియ్య మామిడి చెట్టుకు అల్లుకున్న మాధవీలత రాధాకృష్ణులు, వెన్నెల రాత్రులలో నదీ తీరంలో విహరిస్తూఉంటే వీరిద్దరూ ఎవరికీ కనిపించలేదట. ఒకప్పుడు రాధ కనిపిస్తుంది. ఒకప్పుడు కృష్ణుడు కనిపిస్తాడు. కారణమేమిటి? చెట్లనీడలో వీరు కదులుతూ ఉంటే, గాఢాంధకారంలో శ్రీకృష్ణుని మేఘశ్యామల వర్ణము కలిసిపోయి రాధ మాత్రమే కనిపించేదట చూపరులకు. రాధ ఒక్కతేపోతున్నది

కదా. కృష్ణుడేడి ? ఊరకనే పాపమామెకు అపనిందయా? అదేవిధంగా వెన్నెలలో వీరిద్దరూ తిరుగుతూ ఉంటే, కృష్ణుని రూపము మాత్రమే కనిపించేదట. రాధ గౌరవర్ణము వెన్నెలలో కరిగిపోయేది, రాధ ఎక్కడ? అయ్యో రాధను అభిసారిక అని అన్నామే. కృష్ణుడొక్కడే కదా కనిపించేది. ఈ విధంగా ఒకప్పుడు రాధ ఒకప్పుడు కృష్ణుడు కనిపించేవారు గాని ఇద్దరినీ, కలిపి చూచిన వారెవ్వరునూ లేరు. ఇదీ రాధా కృష్ణాద్వైతము ...మోక్షమనేమహామోహంతో మునిగి పోవడము భక్తునికి సమ్మతముగాదు తాను వేరు భగవంతుడు వేరైనప్పుడే గదా భక్తి రసాయనాన్ని సేవించేది? రసాయనము త్రాగేవాడు ఒకడే అయితే ఎట్లా? ఆనందవర్ధనాచార్యునంతటి గొప్ప అలంకారికుడు. తాత్వికుడు. గూడా, ఎన్ని కవిత్వ, శాస్త్రచర్చా వ్యాసంగాలు జరిపినా భక్తిలో కలిగిన సుఖము మరొక చోట తనకు లభించలేదని, అంటాడు చూడండి. "నైవ చ లబ్ధమబ్ధి శయన త్వద్భక్తితుల్యం సుఖమ్''- భక్తిని గూర్చివ్యాససూక్తినొకసారి మననము చేసుకుందామా ?

> "వాగ్గద్గదా ద్రవతే యస్య చిత్తం
> రుదత్యభీక్ష్ణం హసతి క్వచిచ్చ
> విలజ్జ ఉద్గాయతి నృత్యతే చ
> మద్భక్తి యుక్తో భువనం పునాతి.
> యథాగ్నినా హేమ మలం జహాతి
> ధ్మాతం పునః స్వం భజతే చ రూపమ్
> ఆత్మాచ కర్మానుశయం విధూయ
> మద్భక్తియోగేన భజత్యథో మామ్
> విషయాన్ ధ్యాయతశ్చిత్తం విషయేషు విషజ్జతే
> మా మనుస్మరతశ్చితం మయ్యేవ ప్రవిలీయతే''

భగవద్భక్తుని వాక్కు గద్గదమైపోతుంది. చిత్తము ద్రవిస్తుంది. ఏరకమైన బిడియము లేకుండా ఆతడు ఒకప్పుడు ఎలుగెత్తి ఏడుస్తాడు, మరొకప్పుడు నవ్వుతాడు. పెద్దగా కంఠమెత్తిపాడుతాడు. ఆడుతాడు. అట్టి భక్తుడు లోకాన్ని పునీతము చేయగలడు. మూసలోపోసి కరిగించిన బంగారములోని మలినమంతా కరిగిపోయి స్వచ్ఛంగా మేలిమి బంగారు మెరుస్తుంది. అదే విధంగా కర్మల నన్నింటి చెరిగి వేసిన ఆత్మ, భక్తియోగంతో భగవంతుని కొలుస్తూ స్వచ్ఛంగా ప్రకాశిస్తుంది.

భక్తులకెంత మహోన్నతమయిన సంస్కారముంటుందో తెలిపే కథలు అసంఖ్యాకములు భక్తకన్నప్ప నుండి, భీష్మ పితామహుని వరకు అంతా భక్తులే శత్రు రూపంలో ఉన్న భగవంతుని కొలచిన మహానుభావులు భీష్మాదులు చూడండి,

సీ॥ కుప్పించి ఎగసిన కుండలంబుల కాంతి గగన భాగం బెల్ల గప్పికొనక
నుఱికిన నోర్వక యుదరంబులో నున్న జగముల వ్రేగున జగతి గదలం
జక్రంబు జేపట్టి చనుదెంచు రయమున పైనున్న పచ్చని పటము జాఱ
నమ్మితి నాలావు నగుబాటు సేయక మన్నింపు మని క్రీడి మఱల దిగువ
గరికి లంఘించు సింహంబు కరణి మెఱసి
నేడు భీష్ముని చంపుదు నిన్ను గాతు
విడువు మర్జున యనుచు మద్విశిఖవృష్టి
దెరలి చనుదెంచు దేవుండు దిక్కు నాకు"

భీష్ముని ఈ స్తవరాజములో కుప్పించి ఎగసిన శ్రీకృష్ణుని వేగము ఉద్ధయనము, అలవాటు ప్రకారము ఉత్తరీయము జారడమో, లాగడమో, అదేమో తెలియదు భక్తులను రక్షించడానికి ఆయన పడే తొందరపాటు పోతనామాత్యుని బంగారు గంటునుండి వెలువడిన ముత్యాలవరుసలు. తెలుగు సాహిత్యానికే ఈ పద్యమొకవన్నె. దీనికి మూలము వ్యాససూక్తమున్నది గాని, అది తెలుగు జిలుగులోనే ఇక్కడ ఎక్కువ ప్రకాశిస్తున్నది. కుప్పించి ఎగసింది శ్రీకృష్ణుడు కాదు. పోతన కవితాలహరి. ఊహాసింధువు అక్కడనే గజేంద్ర మోక్షములోని మరొక్క పద్యాన్ని చెప్పుకొకపోతే తృప్తిఉండదు; గజాన్ని రక్షించాలనే తొందర శ్రీ మహావిష్ణువు మనస్సులో ఎంత ఉందంటే రోజంతా అటూ ఇటూ సవరించి రైలు బయలుదేరే సమయంలో పరుగెత్తు వారి కున్నంత తొందర;

"సిరికిం జెప్పఁడు శంఖ చక్రయుగముం చేదోయి సంధింపఁడే
పరివారంబును జీరఁడభ్రగపతిం బన్నింపఁడా కర్ణికాం
తరధమ్మిల్లముఁ చక్కనొత్తఁడు వివాద ప్రోద్ధత శ్రీకుచో
పరిచేలాంచల మయిన వీడఁడు గజప్రాణావనోత్సాహియై."

భక్తిభావ ప్లావితమయిన సాహిత్య సృష్టిలో బహుశ భారతదేశానికి సాటి వచ్చే సంస్కృతి ఇతరత్ర లేదేమో ఈ భక్తకవులే పుట్టి గానం చేయకపోతే ధర్మరక్షణకు ముప్పు ఏనాడో కలిగేదేమో, రాముడు, కృష్ణుడు, శివుడు, ఈమూడు భగవద్రూపాల నాధారంగా జేసుకొని తామరతంపరగా సంస్కృత, తమిళ, హిందీ, మరాఠీ, కన్నడ, గుజరాతీ, బెంగాలీ, ఆంధ్రభాషలలో భక్తి సాహిత్యము విస్తరించినది. దానికి పుష్టికలిగించిన వారు సంతకవులు వీరందంకీ మూలపురుషుడు వ్యాసభగవానుడు వీరంతా మనకు శ్రద్ధేయులు :

"ప్రాయేణ తీర్థాంభిగమాపదేశైః స్వయం హి తీర్థాని పునంతి సంతః

సంతులు పుణ్యతీర్థాలను సందర్శిస్తారు. ఆ తీర్థ సందర్శనం వల్ల వారు పునీతులవుతున్నారా? వారికి పాపాలను కడిగి వేసుకొనే అవసరం ఉన్నదా? తీర్థోదకాన్ని, అగ్నిని శుద్ధిచేసే అవసరము లేదంటారు, వీరుగూడా అగ్నివంటివారే. తీర్థోదకము వలె తమ సాంగత్యములో ఉండేవారిని పవిత్రంగా చెసేవారు. వీరే తమ సాంగత్యంలో తీర్థస్నానాలను పవిత్రం చేస్తారు. శంకరభగవత్పాదుల తపోమహిమతో శ్రీశైలము పునీతమయిందా? శ్రీ పర్వత పాతాలగంగాజలాల మహిమవల్ల భగవత్పాదుల సమాధి చెరగకుండా నిలిచిందా? ఇది పరస్పరానుబంధాన్ని కలిగించే సన్నివేశము శివపార్వతుల వాసము వల్లనే గదా,హిమాలయము దేవభూమి అయింది. పవిత్ర నదులలో స్నానం చేయగనే పుణ్యమొచ్చేటట్టయితే అందులో స్నానం చేసే పశుపక్ష్యాదులకు గూడా రావాలి....అట్లే మనస్సు వైరాగ్యాన్ని పొందకుండా కాషాయం ధరించినంత మాత్రాన సిద్ధికలిగేట్టయితే పరవ్రతాలకు చెట్లకు, ఎప్పుడో సిద్ధి కలిగి ఉండేదే. చెట్టుబెరడు కాషాయము, పరవ్రతాలు ఊరికి దూరాన ఉంటాయిగదా మరి.

"వ్యక్షస్తు భవేన్మృత్యుః త్ర్యక్షరం బ్రహ్మ శాశ్వతమ్
మమేతి చ భవేన్మృత్యుః నమమేతి చ శాశ్వతమ్"

"మృత్యుః" అనే పదానికి రెండే రెండక్షరాలు. బ్రహ్మకు పర్యాయ పదము "శాశ్వతమ్" ఇది మూడక్షరాలున్న పదము. "మృత్యువు" నాది నాది అని విషయవాంఛలలో మునిగి పోతుండగా, శాశ్వతమ్ నాదికాదు, నాదికాదు అని ప్రపంచము తెలిసికొంటుంది. రెండు,మూడక్షరాల వ్యత్యాసము ఎంత ఉందో చూశారా?

మన సంస్కృతి తల్లి, తండ్రి, గురువు, వీరుముగ్గురు పరమపూజ్యులని ఘోషిస్తున్నది:

"ఏత ఏవత్రయోలోకాః ఏత ఏవాశ్రమాస్త్రయః,
ఏత ఏవత్రయో వేదాః ఏతఏవత్రయోఽగ్నయః
పితావై గార్హపత్యాగ్నిర్దక్షిణః స్మృతః
గురు రాహవనీయస్తు సాగ్నిత్రేతాగరీయసీ"

వీరు ముగ్గురు ముల్లోకాలు, వీరే మూడు ఆశ్రమాలు, (బ్రహ్మచర్య గృహస్థ, వానప్రస్థములు) వీరే ఋగ్యజుస్సామములనెడు మూడువేదములు, వీరే త్రేతాగ్నులు ఈ మూడగ్నులనూ ఈ విధంగా విభజించవచ్చును. తండ్రి గార్హపత్యాగ్ని, తల్లిదక్షిణాగ్ని, గురువు అహవనీయము ఈ మూడగ్నులు అసలు అగ్నుల కన్న గొప్పవారు.

ఇక్కడ గురుశిష్యసంబంధమును గూర్చి కొంత ముచ్చటించవలసిఉన్నది. ఉపనిషత్తులన్ని, గురుశిష్యుల చర్చారూపకములే, గీతలన్నియూ ఇట్టివే గీతలంటే భగవద్గీత మొదలుగాగల అసంఖ్యాకగీతలు. ఇందులో జిజ్ఞాసువు జ్ఞాని అయిన గురువును సమీపించి తన సందేహాన్ని వెలిబుచ్చుతాడు.గురువు అనేక ఉదాహరణలతో అన్వయ వ్యతిరేక రూపమున శిష్యుని సందేహాన్ని నివృత్తి చేస్తాడు. అవసర మయితే చెప్పినదాన్నే పునరుక్తము చేస్తాడు. ఆచేసే ముందు శిష్యుని యోగ్యతను గూడా పరీక్షిస్తాడు. ఇది అతికఠిన పరీక్ష. ముందీ ఎంట్రన్స్ పరీక్షలో ఉత్తీర్ణు డయిన వానికే గురుకులములో స్థానముంటుంది. గురువు శిష్యునికి కామక్రోధ లోభాదులున్నవా అని పరీక్షిస్తాడు,అవి ఉన్నవాడికి పరినిష్ఠిత బుద్ధిఉండదు. అథవా, ఇంతో అంతో విషయ పరిజ్ఞానమేర్పడినప్పటికినీ దాన్నతడు దుర్వినియోగపరు స్తాడు. అందుకే శిష్యుడు కుశాగ్రబుద్ధి అయినప్పటికి అతనికి చిత్తశుద్ధిలేకుంటే విద్యాదానము చేయడానికి గురువులు సిద్ధపడేవారుగాదు. ఇప్పటికి ఈ పద్ధతి

లలితకళలను నేర్పేవారిలో కనబడుతూనే ఉంది. సంగీతము, నాట్యము, చిత్ర లేఖనము నేర్పించేవారు విద్యారహస్యాలను అందరికీ చెప్పరు.

ఈ పరీక్షా పద్ధతిలో ప్రధానమయింది. గ్రహణశక్తి విద్యార్థికి ఉన్నదా, లేదా అనేది. మహా భారతములోని కొన్ని కథలను ఇక్కడ వినిపిస్తాను. ఉద్దాలక ఆరుణి అనే బాలుడు గురువు దగ్గరకు విద్యాభ్యాసానికి పోతాడు. ఆరుణి చలికాలము లో వరిచేను దగ్గర కాపలా కాస్తున్నప్పుడు వరిగట్టు తెగి నీరు బయటికి రావడ మారంభ మవుతుంది. "నాయనా పాంచాలారుణీ'' గట్టుతెగింది. నీరు బయటకు రాకుండా అరికట్టు" అని గురువు పలుకుతాడు, శిష్యుడామేరకు చేనుదగ్గరకు పోయి ప్రయత్నిస్తాడు, కాని కట్టడమతనికి సాధ్యంకాలేదు. తానే అడ్డంగా పడుకుంటాడు. శిష్యుడిల్లుచేర లేదని వ్యాకులముతో గురువు అతన్ని వెతుక్కుంటూపోయి ఎలుగెత్తి ఓ ఆరుణీ, ఎక్కడున్నావు? రా'' అని పిలువగానే పిల్లవాడు పరుగెత్తుకుంటూ అతనిని చేరుకుంటాడు. అతని గురుభక్తి మెచ్చి గురువు సకలవిద్యలతనికి ప్రతి భా సమానముగా లు కాగలవనివరమిస్తాడు. వరిగట్టు ఏమిటి? దానికి అడ్డంగా పడు కోవట మేమిటి? గురువు పిలవగనే వెళ్ళిపోవడ మేమిటి? ఈనాటి విద్యార్థులీ కథ వింటే నవ్విపోరూ? విద్యార్థిని మూర్ఖుడని భావించరూ?.... అదికాదు, ఇది గురువు విద్యార్థిని పరీక్షించిన తీరు. తనమాటమీద ఎంత గౌరవమున్నది విద్యార్థికి, అని. హాలెండు దేశము సముద్రమట్టము కంటే దిగువలోవున్నది. సముద్రపు నీరు దేశాన్ని ముంచెత్తకుండా వారక్కడ డైకులనుకట్టి నీటిని ఆపివుంచినారు. అక్కడ ఒకచోట నీరు కన్నములోనుండి రావడము మొదలైందట. దాన్ని చూచిన పిల్లవాడొకడు నీటిని అరికట్టడానికి ముందు తనవేలును, ఆ తరువాత కాలును అడ్డు పెట్టి అక్కడి దుర్భరమైన చలికిబిగుసుకుపోయి, దేశవాసులను రక్షించడానికి తనప్రాణాలను బలిచేసిన కథ మనము చదివినదే. ఉద్దాలక ఆరుణి కథగూడా అటువంటిదే. అయితే అది పాశ్చాత్య కథ కనుక దుఃఖాంత మయింది. మనది సుఖాంతమైంది. గురువతనిని వెదక్కుంటూ రాకపోతే మనపిల్లవాడు గూడ హరీ! అనేవాడే. ఇక్కడ "The Boy Stood on the Burning Deck'' అనే మరొక కథ జ్ఞాపకానికి వస్తుంది. తండ్రి పిల్లవాడిని పడవ డెక్ (కప్పు) మీద నిలబడమని చెప్పిపోగా ఆపడవకు నిప్పంటుకుంది. పిల్లవాడు మాత్రము తండ్రి నిలువమన్న చోటునుండి ముందుకు కదలడు, తనప్రాణాల నావిధంగా కోల్పోయిన బాలుడిని ధర్మవీరుడిగా భావిస్తారు. అతడే కసాబియాంకా.

రెండవ శిష్యుడు ఉపమన్యువు. గురువు ధౌమ్యుడే, ఉపమన్యువును భిక్షాటనము చేసి తన కన్నము పెట్టమని అడుగుతాడు ఉపమన్యువు భిక్షాన్నాని తెచ్చి గురువుకు పెట్టి తిరిగి భిక్షాటనము చేసేవాడు. గృహస్థులను రెండుసార్లు ఒకేరోజు అర్థించ రాదని గురుపత్నిని వారిస్తాడు. చేసేదిలేక ఆవును అడవికి తోలుకొని పోయి వచ్చే ఉపమన్యువు, దూడ త్రాగగామిగిలిన పాలను త్రాగి ఆకలిని తీర్చుకొనసాగాడు. గురువదికూడా తగదని అతనిమీద మచ్చికతో, దూడ తాను కడుపు నింపుకొనక అతనికి పాలను విడిచి పెడుతున్నదని అంటాడు. అతని శాసనము మేరకు అదిగూడా వదలి పెట్టిన ఉపమన్యువు, దూడపాలుత్రాగుతు డగా దానినోటినుండి వచ్చిన నురగను నాకి తృప్తిపడతాడు. దూడకతనిమీద ప్రేమ ఉండటంవల్ల పాలను వ్యర్థము చేస్తున్నదని,జొల్లుకార్చి వేస్తున్నదని అదికూడా తగదని గురువు వారిస్తాడు. ఇక చేసేది లేక ఆవులను కాచే ఉపమన్యువు అడవిలో తిరుగుతూ దొరికిన జిల్లేడు ఆకులను తిని గుడ్డివాడై,పాడుబడ్డ బావిలో పడిపోతాడు. అతడాకలిని ఎంతవరకు ఓర్చుకోగలడనేదాని కిది పరీక్ష. ఇప్పుడు శిష్యుని ఆచూకీకొరకు గురువు అడవికి బయలుదేరి శిష్యుని దీనదశను చూసి అశ్వినీ దేవతలను స్తోత్రము చెయమంటాడు. దేవవైద్యులైన ఈ కవలలు ఉపమన్యునకు పోయిన దృష్టిని ప్రసాదిస్తారు. ఇంత కఠిన పరీక్షకు గురిఅయిన ఉపమన్యువు, విద్యావంతుడైనాడని వేరే చెప్ప నక్కరలేదు.

ఇక మూడవ శిష్యుడు వేదుడు. ఇతని చేత గురువు గొడ్డుచేతచేయించి అతడి సహన శక్తిని పరీక్షించి చూస్తాడు. ఎద్దు బదులు నాగలికి కట్టి, భూమిని అతనిచేత దున్నిస్తాడు. అయినా వేదుని విశ్వాసము చలించలేదు. అప్పుడతనికి గురువు అన్నివిద్యలను ప్రసాదించినాడు.

వేదుని శిష్యుడు ఉత్కంకుడు. గురువొకసారి యజ్ఞము చేయించ దానికి జనమేజయ పౌష్యుల పిలుపున ఇల్లు వదలి పోవలసిరాగా తాను లేనపుడు తనఇంటో తానులేనిలోటు రాకుండా చూసుకొమ్మని ఉత్కంకునికి ఆదేశాన్ని ఇచ్చిపోతాడు వేదుని భార్య ఋతిమతిఅయి,తన ఋతుకాలాన్ని వ్యర్థము చేయకుండా తనభర్తలేని లోటును తన కోరికను తీర్చమని అంటుంది. ఉత్కంకుడిది అకార్యమని, అట్టి ఆ కార్యము తాను చేయజాలనని చెప్పి, కామ వాసనలను జయించి స్థితప్రజ్ఞను నిరూపించు కుంటాడు.

ఈ కథలవల్ల ఏమి ప్రయోజనము? ఒకటే.... గురువుమీద ఇంతో అంతో శ్రద్ధలేనివానికి చదువురాదు. ఆకలిదప్పులను కామక్రోధాదులను అదుపులో ఉంచుకోకపోతే చదువురాదు. ఇన్నింటికన్న పెద్దముప్పు ఒకటున్నది. విషయ పరిజ్ఞానము మాత్రమే ఉండి వివేకము శూన్యమయితే, క్రౌర్యము, దుష్టత్వము ఎక్కువయితే, అట్టివాని చేతిలో ప్రేలుడు పదార్థాన్ని ఉంచితే, ఎంతప్రమాదమో ఊహించ వచ్చును. గురుశిష్యుల సంబంధాన్ని గూర్చిన ఉద్ధవగీతభాగాన్ని చూడండి.

"ఆచార్యోఽరణి రాద్యః స్యాందతే వాస్యుత్తరారణిః
తత్సంధానం ప్రవచనం విద్యా సంధిః సుఖావహః''

ఆచార్యుడు అరణి, అంతేవాసి-శిష్యుడు ఉత్తరారణి. వారికి సంధానము, ప్రవచనము, సంధి విద్య. ఈ ఉభయుల సంబంధము విచ్ఛిన్నంగా ఉన్నంత కాలము సభ్యత, సంస్కృతి నిలుస్తుంది. తైత్తరీయ ఉపనిషత్తులోని వాక్యమిక్కడ స్మరణీయము.:

"ఆచార్యః పూర్వరూపమ్, అంతే వాస్యుత్తర రూపమ్,
విద్యా సంధిః ప్రవచనః సంధానమ్.''

ఆచార్యుడు పూర్వరూపము. మొదటి రూపము, అతడి ఉత్తర రూపమే ప్రతిబింబము. శిష్యుడు, విద్యవారిమధ్య సంధి, ప్రవచనము అనగా పాఠము చెప్పడము సంధింప జేయుసాధనము, సంధానము. ఇది ఉపనిషత్తు: అనగా సన్నిహితంగా ఉండడము.

ఋతము, సత్యము తపము, శమదమములు, అగ్నులు, అగ్నిహోత్రము, అతిథి సపర్య, మానవసేవ, శిశుపోషణము, సంతానాభివృద్ధి, సంతానాన్ని పొందడం ఇవన్నీస్వాధాయ ప్రవచానాలవల్లనే రక్షింప బడతాయి. కొనసాగుతాయి. జ్ఞాన విస్తరణతో బాటే, ఇవన్నీ కూడా ముడివేసుకుని ఉండాలని, తైత్తరీయము ఘోషిస్తుంది. సత్యమే సర్వోన్నతమని రథీతరుడంటే. తపస్సే ఎప్పుడూ ఆచరించదగినదని పురుశిష్టుని కొడుకయిన పౌరుశిష్టిఅంటున్నాడు. ముద్గలుని కొడుకు నాక మౌద్గల్యుడు, స్వాధ్యాయ ప్రవచనములే సర్వోత్తమములను వాటిని పాటించడమే తపమని అంటున్నాడు.

"ఓం సహనా వవతు, సహనౌ భునక్తు
సహ వీర్యం కరవావహై, తేజస్వినావధీతమస్తు మావిద్విషావహై"

మా ఉభయులను ఆ దివ్యశక్తి రక్షించుగాక, మా ఉభయుల అధ్యయన ఫలాన్ని మేమనుభవింతుము గాక, మేముభయులము బుద్ధిశక్తితో విద్యా రహస్యాలను పరిశోధింతుముగాక, మా అధ్యయనము తేజస్వి, ఫలప్రదమగుగాక, గురు శిష్యులము మేముభయులము ఎట్టి వైరభావము లేక ఉందుము గాక !

మన పూర్వీకులు వెలిగించిన ఈ జ్ఞానజ్యోతిని, విద్యా పరంపరను, గురు శిష్య సంబంధాన్ని మనము రక్షించుకోవాలి. ఆధునిక విద్యార్జనకు ఈ పరంపర ప్రతిబంధకముగాదు. శరవేగంతో పరుగెత్తే మన జీవనములో ఈ మాటల నప్పుడప్పుడు తలచుకొంటూ ఉంటే వేగము తగ్గుతుంది. మనస్సు చల్లబడుతుంది. ద్విగుణీకృత శక్తితో ముందుకు బయలుదేరవచ్చును. "దామ్యత, దత్త, దయధ్వమ్'' (ఇంద్రియాలను నిగ్రహించుకొనండి, దానం చేయండి, దయకలిగి ఉండండి), అనే బృహదారణ్యకోపనిషత్తులోని ఉపదేశము, విద్యాభ్యాసాన్ని ముగించి, జీవితంలో అడుగు పెట్టబోయే విద్యార్థులకై చేసిన స్నాతకోపన్యాసము. శాంతి పర్వంలోని ఈ పంక్తులను చూడండి:

"శిష్యోపాధ్యాయి కావృత్తి ర్యత్రస్యాత్ సుసమాహితా,
యథావచ్ఛాస్త్ర సంపన్నా కస్తం దేశం పరిత్యజేత్''

ఎచ్చట గురు శిష్య పరంపర, శాస్త్రాధ్యయనము అవిచ్ఛిన్నంగా ఉంటుందో అట్టి స్థానాన్ని ఎవరు వదలి పెడతారు. "దేశమంటే మట్టికాదోయ్, దేశమంటే మనుషులోయ్'' అన్నట్లు విద్యాలయాలంటే కట్టడాలు, కుర్చీలు, బెంచీలు కావు. విద్యాలయాలంటే, విద్యా గురువులు, జిజ్ఞాసువులయిన విద్యార్థులు.

మూర్ఖుడు ఎంత ప్రయత్నించినా, ఆత్మస్తుతి ఎంత చేసుకున్నా, అతనిని ఎవరూ గౌరవించరు. కాని విద్యావంతుడెక్కడ దాగి ఉన్నా, ఒక గుంటలో దాగి ఉన్నా ప్రకాశిస్తాడని ఈ క్రింది శ్లోకం చెబుతున్నది.

నలోకే దీప్యతే మూర్ఖః కేవలాత్మ ప్రశంసయా
అపి చాపిహితః శ్వభ్రే కృతవిదః ప్రకాశతే''

మన ఆధునిక సభ్య సమాజములో విద్యావంతునికి ఈ గౌరవస్థాన మున్నదా? ధనముతో ప్రమేయం లేకుండా విద్యను మన మాదరిస్తున్నామా? సాంకేతిక విద్యాపరిజ్ఞానము బలపడాలంటే, సమర్థంగా ఉండాలంటే, అణాపై సలతో లాభ నష్టాలంబేరజు వేయని నైతిక విద్యావైదుష్యాన్నిదానికి జోడించాలని మనము తెలుసుకుంటున్నామా?

సుభాషితాలు పలికే వారుంటారు కాని వినేదెవరు? వినే వారుంటారని వ్యాసుడు నమ్మినాడు.

"అసదుచ్చైరపిప్రోక్తః శబ్దః సముప శామ్యతి
దీప్యతే, త్వేవ లోకేషు శనైరపి సుభాషితమ్.

చెడుమాటను పర్వత శిఖరాన్నెక్కి ఎలుగెత్తి అరిచిచెప్పినా, అది వెంటనే మాటు మణిగిపోతుంది. మెల్లమెల్లగా చెప్పినా, సుభాషితము లోకంలో ప్రకాశిస్తుంది.

"నాపృష్టః కస్య చిద్బ్రూయాన్నాప్యయేన పృచ్ఛతః
జ్ఞాన వానపి మేధావీ జడవత్సముపావిశేత్''

మనుషులు కలిసి ముచ్చటించుకొనేటప్పుడు, ప్రతి ఒక్కరూ తమకు తెలిసిన విషయము కక్కివేయాలని తపన పడుతుంటారు. పాశ్చాత్యులు, భారతీయుల ప్రసంగ విధానంలో ఈ లోపాన్ని ఎత్తిచూపుతూ ఉంటారు. ఒకరు ముగించనిదే మధ్యలో కల్పించుకొని, మరొకరు మాట్లాడటం భారతీయుల బలహీనత అది సభ్యమర్యాద కాదు. ఈ తొందరపాటును వారిస్తూ వ్యాసుడు పై ఉపదేశాన్ని చేశాడు. అడగనిదే ఎవ్వరితోనూ మితిమీరి ప్రసంగించరాదు. న్యాయసమ్మతముగాని ప్రశ్నకు సమాధానము చెప్పరాదు. మేధావి, జ్ఞాని గూడా అవసరము లేని చోట జడుని వలె కూర్చోవాలి గాని, అతిప్రసంగము ఎదుటి వానిని బాగుపరుస్తుందని నమ్మడము అవివేకమే.

''అబ్రువన్ కస్య చిన్నిందా మాత్మపూజామవర్ణయన్
విపశ్చిద్గుణ సంపన్నః ప్రాప్నోత్యేవ మహద్యశః
అబ్రువన్ వాతి సురభిర్గంధః సుమనసాం శుచిః
తథైవా వ్యాహరన్ భాతి మలో భానురంబరే''

విద్వాంసుడని ఎవర్ని అనాలి? ఇతరులను నిందించక, తనను తాను పొగడుకొనకుండా ఉన్న గుణవంతుడే విద్వాంసుడు. అతడే గొప్ప కీర్తిని పొందుతాడు. పూవులోని తావి, నేను పరోపకారము చేస్తున్నానని చెప్పుకుంటుందా? ఏమీ చెప్పకుండానే స్వచ్ఛమైన సుగంధాన్ని నలుదెసల వ్యాపింపజేస్తున్నది. కదా? ఇదిగో నేనుదయిస్తాను. అంధకారాన్ని పటాపంచలు చేస్తాను చేస్తాను. పద్మాలను వికసింప జేస్తాను. వనస్పతులకు ఆహారాన్నిచ్చి వాని ద్వారా జీవులను పోషిస్తాను. అని చెబుతున్నాడా సూర్యభగవానుడు? నిర్మలములైన సూర్యకిరణాలు చెప్పకుండానే ప్రకాశిస్తున్నాయి. గదా!

సత్యస్య వచనం శ్రేయః సత్యజ్ఞానం తు దుష్కరమ్
యద్భూత హిత మత్యంత మేతత్సత్యం బ్రవీమ్యహమ్

"సత్యం బ్రూయాత్ ప్రియం బ్రూయాత్, మా బ్రూయాత్ సత్యమ ప్రియమ్" (సత్యమును పలుక వలసింది. ప్రియాన్ని అంటే ప్రియకర వచనాన్ని పలుక వలసింది. అప్రియమయిన సత్యాన్ని పలుకరాదు.) అని ఒక ఉపదేశ వాక్యమున్నది. సత్యమప్రియంగా ఉండదు కదా, సహజంగా సత్యము కటువుగానే ఉంటుంది. అట్లా అని ప్రియము చేయడం కొరకు అసత్యాన్ని మాట్లాడ వచ్చునా? కూడనే కూడదు. "సత్యమేవ జయతే" అని "సత్యం వద, ధర్మంచర" అని శ్రుతి చోదనము చేస్తున్నది "తత్సుత శతకంబు కంటె నొక సూనృత వాక్యము మేలు భూవరా! అని శకుంతల దుష్యంతుణ్ణి ఉద్బోధిస్తున్నది. కాబట్టి సత్యమే వలకాలి. అయితే ఏది సత్యమో మనకు తెలియదు. సత్యజ్ఞాన మతిదుష్కరము కాబట్టి, ఏది సర్వభూతములకు అత్యంతహితకరమో, అదే సత్యము అని వ్యాసభగవానుడంటున్నాడు. ఇది ఆలోచనామృతము.

శ్రేయోమార్గము, శ్రేయస్సు, శ్రేయస్సు అని అంటున్నారు. ఏది శ్రేయస్సు. ఏది ప్రేయస్సు? ఏది ఆకర్షకము, ఏది హితకరము? ఇది మిలియన్ డాలర్ల ప్రశ్న? అర్జునుడు శ్రీకృష్ణుని అడిగిన ప్రశ్న ఇదే

యచ్ఛ్రేయః స్యాన్నిశ్చితం బ్రూహితన్మే.... ఓ కృష్ణా శ్రేయస్సు ఏది? కాదు. యుద్ధము చేయడము శ్రేయస్సా, మానడము మంచిదా? శ్రేయస్సును వ్యాసుడిట్లు నిర్వచించెను.

గురుపూజాచ సతతం వృద్ధానాం పర్యుపాసనం
శ్రవణం చైవ శాస్త్రాణాం కూటస్థం శ్రేయ ఉచ్యతే.
అనుగ్రహం చ మిత్రాణా మమిత్రణాం చ నిగ్రహం,
సంగ్రహం చ త్రివర్గస్య శ్రేయ ఆహుర్మనీషిణః.
మార్దవం సర్వభూతేషు వ్యవహారేషు చార్జవమ్,
వాక్ చైవ మధురా ప్రోక్తా శ్రేయ ఏత దసంశయమ్.
ధర్మేణ వేదాధ్యయనం వేదాంతానాం తథైవ చ,
జ్ఞానార్థానాం చ జిజ్ఞాసా శ్రేయ ఏత దసంశయమ్.
శబ్దరూప రసస్పర్శాన్ సహగంధేన కేవలాన్,
నాత్యర్థముపసేవేత శ్రేయసోర్థీ కథంచన.
నక్తంచర్యా దివాస్వాప మాలస్యం పైశునం మదమ్,
అతి యోగమయోగం చ శ్రేయసోఽర్థీ పరిత్యజేత్.

గురువులను, వృద్ధులను పూజించి సేవించడం, శాస్త్రాధ్యయనమూ శ్రేయో మార్గములు, స్నేహితులననుగ్రహించడం, శత్రువుల నెదుర్కొనడం, ధర్మార్థకామాలను సాధనం చేయడం శ్రేయో మార్గమని మనీషులంటారు. అన్ని భూతాల ఎడల (జీవుల ఎడల) మృదువుగా ఉండడము, వ్యవహార విషయంలో ఋజువర్తనులై ఉండడము. మధురంగా మాట్లాడడం నిస్సంశయంగా శ్రేయము. వేదాన్ని, వేదాంతమయిన ఉపనిషత్ప్రతి పాదితమైన తత్త్వశాస్త్రాన్నిఅధ్యయనంచేయడం, శాస్త్ర జిజ్ఞాస, ఇది శ్రేయస్సుగాక మరేమౌతుంది? కేవలము శబ్దస్పర్శ రూపరస గంధాలనే పంచతన్మాత్రలను సేవిస్తూ కూచుంటే, లోలపత్వం కలుగుతుంది. అవి శ్రేయస్సుగాదు. రాత్రిళ్ళు తిరగడం, పగలు నిద్రించడం, మదము, సోమరి తనము, పశుత్వము, (దుష్టత్వము) మితిమీరి దేన్నిగురించి అయినా ఆలోచించడం ఇవన్నీ శ్రేయోమార్గాలు కావు.

"అమృతం చైవ మృత్యుశ్చ ద్వయం దేహే ప్రతిష్ఠితమ్,
మృత్యురాపద్యతే మోహాత్ సత్యేనాఽపద్యతేఽమృతమ్''.

మానవుని దేహములో అమృతము, మృత్యువు ఈరెండు పరస్పర వ్యతిరేక తత్త్వములుండనే ఉన్నవి. మోహము (అజ్ఞానము)జనన మరణ ములకు కార

జమవుతుంది. సత్యము అమృతత్వానికి హేతువు, సత్యమే అమృతత్వమ
Truth in Immortality

### సత్యము వేదసారము

"వేదస్యోపనిషత్ సత్యం సత్యస్యోపనిషత్ దమః,
దమస్యోపనిషద్దానం. దాన స్యోపనిషత్ తపః",

వేదవేమి బోధిస్తున్నది? సత్యాన్ని, తదన్వేషణ మార్గాన్ని బోధిస్తున్నది. వేద సారము, రహస్యోపదేశము సత్యమే, సత్యము పలికితే ఏం జరుగుతుంది సత్యం పలికినవాడు దేన్ని సాధించాలి? దమాన్ని, నిగ్రహాన్ని నిగ్రహము ఇంద్రియాలమీద లేనివాడు అసత్యాన్ని పలుకుతాడు. కాబట్టి సత్యసారము ఇంద్రియ నిగ్రహము, దీని పర్యవసాన మేమి? నిగ్రహంగా ఉన్నందున కలిగే ప్రయోజనమేమి? త్యాగగుణ మతనిలో అభివృద్ధిజెంది, దానశీలి అవుతాడతడు. "త్యాగేనైకేనా ఽ మృతత్వ మానశుః" అని అన్నారు. త్యాగమే అమృతత్వానికి మార్గము. దానశీలుడు తపస్సు చేసినవారు. దానగుణముయొక్క సారము తపస్సు ఈవిధంగా యోగసాధనలో ఏఒక్క గుణాన్ని అలవరచు కోవాలని ప్రయత్నించినా, దానివల్ల తక్కిన గుణసంపద దానంతట అదే అబ్బుతుంది, అహింసా ధర్మాన్ని పాటించాలంటే, సత్యము, అక్రోధము, అస్తేయము మొదలగునవి రానే వస్తవి. అట్లే దుర్గుణాలు ఒక్కటి వచ్చినా దానివెంట ఇతర గుణాలు రానేవస్తవి. వ్యభిచరించే వారసత్యమాడక తప్పదు. క్రోధమున్న వాడెందరినో హింసిస్తూనే ఉంటాడు.

యథాపుష్ప ఫలోపేతో బహుశాఖో మహాద్రుమః,
ఆత్మనో నాభి జానీతే క్వమే పుష్పం, క్వమేఫలమ్.
ఏవమాత్మాన జానీతే క్వ గమిష్యే కుత స్త్వహమ్.
నైవస్త్రీనపుమానేతన్నైవ చేదం నపుంసకమ్,
అదుఃఖ మసుఖం బ్రహ్మ భూత భవ్య భవాత్మకమ్.

ఆత్మ మాయతో కప్పబడి ఉంటుంది. మాయనే సృష్టి కంతటికినీ మూలము. అందుకే దేహాన్ని ధరించి స్వరూపాన్ని మరచిన ఆత్మ,తానెక్కడనుండి వచ్చినదీ, ఎటుపోయేదీ ఎరుగదు. పూలు, ఆకులు, కాయలు, కొమ్మలతో కిక్కిరిసి పెరిగిన చెట్టు, తనఆకులు, పండ్లు, ఎక్కడెక్కడ వరకు వికసించినదీ ఎరుగనే ఎరుగదు.

కదా! అట్లాగే విస్మృతయిన ఈ ఆత్మ తన ఉనికిని ఎరుగలేక పోతున్నది. అసలు సత్యమేమిటంటే బ్రహ్మ పదార్థాన్ని భిన్నమైన ఈ ఆత్మతత్త్వము స్త్రీకాదు, పురుషుడుకాడు, నంపుసకమున్నూ కాదు, దుఃఖమూ కాదు, సుఖమున్నూగాదు, భూత భవిష్యద్వ ర్తమానాత్మక మయినదిది.

దేహమనే ఒకే వృక్షశాఖలో రెండు సుపర్ణములు (మంచి రెక్కలున్నవి) పక్షులు యాదృచ్ఛికంగా గూళ్ళను కట్టుకున్నాయి. ఈ రెండు పక్షులు చూడడానికి ఒకే విధంగా ఉన్నాయి. ఈరెండు మైత్రీభావాన్ని కలిగి ఉన్నాయి. అందులో ఒక పక్షి పిప్పలాన్నమును భుజిస్తున్నది. మరొకటి తినకుండా చూస్తూఉన్నది. కాని భుజించనిపక్షికే బలాధిక్యమున్నందున అదే గొప్పది. ఏవీ రెండుపక్షులు? జీవాత్మ, పరమాత్మలు అవి పిప్పలాన్న మేమిటి? పిప్పలాన్ని అశ్వద్ధమని గూడా అంటారు. అశ్వద్థమంటే రేపటికి మిగలనిది. నశించి పోయేది అని భావము. అశ్వత్థము దేహమే. ("ఊర్ధ్వ మూల మధః శాఖ మశ్వత్థం ప్రాహురవ్యయమ్") (భగవద్గీత) దేహగతాలయిన సుఖదుఃఖాలననుభవించడమే "పిప్పలాన్ని" తినడము. భోక్తకు కష్టసుఖాములు తప్పవు. కర్తచూస్తూ ఉంటాడు. ఉద్ధవగీత లోని ఈ శ్లోకాన్ని చూడండి.

"సువర్ణావేతౌ సదృశౌ సఖాయౌ, యదృచ్ఛయే తౌ కృత నీడౌ చవృక్షే
ఏకస్తయోః ఖాదతి పిప్పిలాన్న-మన్యోనిరన్నోఽపి బలేన భూయాన్".

మనమిదివరలో అనుకున్నట్లు ఇతిహాస పురాణాలు వేదోపబృంహణమే చేస్తున్నాయి. పై శ్లోకము ముండకోపనిషత్తునకు ప్రతిబింబమే: ప్రతిధ్వనియే;

"ద్వా సుపర్ణా సయుజా సఖాయా
సమానం వృక్షం పరిషస్వ జాతే
తయోరన్యః పిప్పలం స్వాద్వత్తి
అనశ్నన్నన్యోఽభి చాకశీతి". ముండకో 1-1-2

ఇట్లా ఆలోచిస్తూ ఉంటే, మనస్సును హేతువాదముతో మథించగా, మథించగా జ్ఞానముద్భవిస్తుంది: ఎట్లంటే.

"నవనీతం యథా దధ్నః కాష్ఠాదగ్నిర్యథైవ చ,
తథైవ విదుషాం జ్ఞానం పుత్ర హేతోః సముద్ధృతమ్."

పెరుగును చిలికితే వెన్న మీదకు తేలినట్లు. కట్టెలను మథించిగా అందుండి అగ్ని పుట్టినట్లు, హేతువాదాన్ని ఆశ్రయించి, చింతనము చేస్తూ ఉండే కొలదీ జ్ఞానోదయ మవుతుంది. అప్పుడుగాని అజ్ఞానమనే అంధకారము నశించదు.

సుభాషితాలు

"పార్థివేష్వివ దేహేషు ప్రవిష్టస్తద్గుణాశ్రయః
గుణైర్నయుజ్యతే యోగి గంధైర్వాయు రివాత్మదృక్"

ఆత్మను దర్శించిన యోగి, జ్ఞానియై, తాను ప్రవేశించిన దేహములోని గుణములకు (సత్త్వరజస్తమములకు) ఆశ్రయ భూతుడగునేకాని, ఆ గుణములతో అతనికి యోగ మేర్పడదు. సుగంధాన్ని గాలి వ్యాపింపజేస్తుంది. కాబట్టి గాలి, గంధానికి ఆశ్రయభూతమౌతుందే తప్ప, ఆయా గంధగుణాలు, సుగంధ దుర్గంధాలు గాలికి అంటుకొనవుగదా, గంధగుణము అయిదు భూతాలలో భూమికే ఉంటుందిగాని గాలికి ఉండదు. అట్లే యోగిని గుణములంటవు.

"స్తోకం స్తోకం గ్రసేద్ గ్రాసం దేహో వర్తేత యావతా
గృహా న హింసన్నాతిష్ఠేత్ వృత్తిం మాధుకరీం మునిః"

మధుకరము అంటే తుమ్మెద. తుమ్మెద ఒక్కొక్క పువ్వునుండి, కొద్ది కొద్దిగా తేనెను త్రాగి, శరీరాన్ని నిలుపుకుంటుంది. ఏ పువ్వునూ అది నాశనము చేయదు. ఏ పువ్వుపైనా నిలువదు. ముని గూడా భిక్షాటనముతో జీవిస్తూ మధుకర వృత్తినే అవలంభించాలి. దేహమున్నంతకాలము దానికి గ్రాసము కావాలి కాబట్టి గృహస్థులను ఇబ్బంది పెట్టకుండా, కొద్దికొద్దిగా భిక్షను గ్రహించాలి. ఏ ఇంట్లోనూ నివాసము చేయరాదు.

3) "అణుభ్యశ్చ మహద్భ్యశ్చ శాస్త్రేభ్యః కుశలోనరః
సర్వతః సారమాదద్యాత్పుష్పేభ్యః ఇవ షట్పదః"

పూవు పూవున తిరిగి పూదేనె అనే సారాన్ని తుమ్మెద గ్రహిస్తుంది. అట్లే బుద్ధిమంతుడయిన నరుడు. చిన్నవానినుండి, పెద్దశాస్త్రములనుండి సారాన్ని గ్రహించాలి. తెలిసికోరాని విద్య ఏదీ కాదు.

"గుణాః పూజాస్థానం గుణిషు న చ లింగం చ నవయః"—

భవభూతి మహాకవి చెప్పిన మాటలివి. గుణము లెక్కడ ఉంటే, అదే పూజాస్థాన మవుతుంది. గుణవంతుడు ముసలివాడా, యువకుడా అన్న మీమాంస

రాకూడదు. అట్లే నీతిబోధకులు స్త్రీలా, పురుషులా అన్నది కూడా అసంగతమయిన ప్రశ్నే. శబరి స్త్రీ కాదా, ఆమె భక్తి లోకోత్తరమయినది కదా. వయస్సు విషయంలో దిలీపమహారాజు గుణగణాలను వర్ణిస్తూ, కాళిదాస మహాకవి చెప్పిన పంక్తులు జ్ఞాపకము తెచ్చుకోదగినవి.

"అనాకృష్టస్య విషయైర్విద్యానాం పారదృశ్వనః
తస్య ధర్మరతేరాసీత్ వృద్ధత్వం జరసావినా".

దిలీపుడు విద్యావంతుడు, కాదు కాదు విద్యా పారంగతుడు. అందుకే విషయములతనివి ఆకర్షించలేకపోయినవి. ఈ బలమైన ఆకర్షణకు లొంగిపోనివానికి ధర్మదృష్టి ఏర్పడుతుంది. అద్దమువలె, అతడి మనస్సు స్వచ్ఛమవుతుంది. ముసలితనము రాకుండానే అట్టివాడు వృద్ధుడవుతాడు. అంటే జ్ఞానవృద్ధుడవుతాడు. జ్ఞానవృద్ధుని వయస్సుతో నిమిత్తములేకుండా, అందరూ అతనిని ఆదరిస్తారు. అందుకే వ్యాసముని "అణుభ్యశ్చ మహద్భ్యశ్చ" అని చెప్పింది. ఇతిహాస పురాణాలనుండి వేదోపబృంహణం చేస్తే, భారతీయ సాహిత్యము నుండి, భారతేతిహాసాన్ని ఉపబృంహణం చేయవచ్చును. ప్రధానంగా సంస్కృత సాహిత్యము భారత రామాయణాల ప్రతిబింబమే.

సమసమాజ వ్యవస్థ అంటే నాకు తెలిసినంతవరకు, సమాజ సంపదను సభ్యులందరూ సమంగా పంచుకోవడము. వారి వారి యోగ్యతలనుబట్టి దాన్ని అనుభవించడము. ఎదుటివాడి కడుపుకొట్టి తాను డబ్బును, ధాన్యాన్ని కూడబెట్టుకోకుండా ఉండటము, ఆకలిదప్పులతో ఎవరూ అలమటించనక్కరలేని వ్యవస్థను స్థాపించడము. ఈ వ్యవస్థకోసము తపించని ఋషి దార్శనికుడు. ప్రవక్త ఎవడు? అయితే మనిషిలో అణిగివున్న దానవత్వము ఈ ప్రయత్నాన్ని వమ్ము చేస్తున్నది. అందుకే మానవుడికి తాను మరచిన ధర్మాలను తిరిగి ఉపదేశించడానికి మహాత్ములు అప్పుడప్పుడూ పుడుతూనేఉంటారు. వేదవ్యాసుడన్న మాటలివి.

"సాయంతనం శ్వస్తనం వా న సంగృహ్ణీత భిక్షితమ్,
మక్షికా ఇవ సంగృహ్ణన్ సహతేన వినశ్యతి"

భిక్షాటనము చేసి, జీవించు సాధువు సాయంత్రానికిగాని, మరునాటికిగాని భిక్షాన్నమును దాచిఉంచుకోరాదు. నిలువచేసుకోరాదు. అట్లా చేసినవాడు

తేనెటీగ వంటివాడు. తేనెటీగ తేనెను నిలువజేసి, నశించిపోతుంది. భిక్షాటనము చేసి జీవించేవాళ్ళను ఉద్దేశించి చేసిన ఈ ఉపదేశము మితిమీరిన ధనాశతో కొట్టు మిట్టాడే వారందరికినీ వర్తిస్తుంది. శాంతిపర్వములో కపోతాఖ్యానమున్నది. అందులో ఒక వేటగాడు చలిరాత్రి, చెట్టుక్రింద చేరితే, చెట్టుమీద ఉన్న పావురము ముక్కుతో చిదుగులను పోగుచేసి చలిమంట చేస్తుంది. ఆ మంటతో అతనికి చలిపల్ల బాధ తగ్గుతుంది. కాని ఆకలిబాధ తగ్గేదెట్లా? అతనికి ఆతిథ్యాన్ని ఇవ్వ దలచిన పావురము దగ్గర నిలువ ఉంచిన ఆహారమేమీ లేదు కదా! అప్పుడా పావురమిట్లా అంటుంది చూడండి :

"నమేఽస్తి విభవోయేన నాశయేయం క్షుధాం తవ,
ఉత్పన్నేన హి జీవామో వయం నిత్యం వనౌకసః,
సంచయోనాస్తి చాస్మాకం మునీనామివ భోజనే''

నీవు నా కతిథివి. నీ ఆకలి తీర్చే ఉపాయము నా దగ్గర లేదు. మునుల వలె మా పక్షిజాతి కూడ వనవాసము చేస్తుంది. మేముభయులము అప్పటికప్పుడు ఆహారాన్ని పుట్టించుకొని ఆకలిని తీర్చుకుంటాము. ఆహారాన్ని నిలువ చేసుకునే పద్ధతి మాదికాదు. అని పై శ్లోకభావము. దీన్ని మార్క్స్ వాదమని అన్నా, గాంధీ మార్గమని అన్నా ఏదైనా అనండి. మనువు చెప్పిన ధర్మమని అన్నా అనండి. కాని వ్యాసుడు కపోతము ద్వారా, తేనెటీగద్వారా అన్వయ వ్యతిరేక ములతో చేసిన ఉపదేశమిది. ఆశ్రమ ధర్మపాలనము చేస్తే అందులో గృహస్థాశ్రమము తరువాత, వానప్రస్థాశ్రమాన్ని స్వీకరించి ముని వృత్తినవలం బించవలసిఉంటుంది. అప్పుడు ధనసంచయము చేయనేరాదు. సరికదా, భోజనాన్ని కూడా మరునాటికి నిలువ చేయరాదు. అట్టివారిని సంఘమే, గృహస్థులే కాపాడ వలసి ఉంటుంది. ఈ విధంగా ధనధాన్య సంచయాన్ని చేసే గృహస్థాశ్రమము గూడా సమాజసేవనే చేస్తుంది. గృహస్థ ధర్మాన్ని, సర్వశ్రేష్ఠ ధర్మమని కాళిదాస కవి ప్రశంసించినాడు. ఇల్లు అంటే ఒక వ్యవస్థ, ఆ వ్యవస్థలో చాలా మంది అనాథలకు నీడ దొరకాలి. పశుపక్ష్యాదులకు, బ్రహ్మచారులకు, మునులకు ఆశ్రయ మిచ్చేవాడే గృహపతి. ఇదీ సనాతన ధర్మవ్యవస్థ. జీవన విధానము మారి, పల్లెలు పట్నాలతో కలిసిపోయి, తమ అస్తిత్వాన్ని పోగొట్టుకుంటున్న ఈ కాలంలో ఈ మాటలు కొంచెము హాస్యాస్పదంగానే ఉంటాయి. కాని ఇది మరుప

రాని ధర్మము. ఎవరి పరిమితిలో వారి ధర్మాన్ని నిర్వహిస్తూ ఉంటే, అదే గొప్ప సంఘసేవ అవుతుంది. గృహస్థ ధర్మాలను, అందు గృహిణి స్థానాన్ని కపోతాఖ్యానము బాగా వివరించింది. చూడండి.

"న గృహం గృహమిత్యాహు గ్గృహిణీ గృహముచ్యతే,
గృహం తు గృహిణీ హీన మరణ్య సదృశం భవేత్
వృక్షమూలేఽపి దయితా యస్య తిష్ఠతి తద్గృహమ్,
ప్రాసాదోఽపి తయా హీనః కాంతార ఇతి నిశ్చితమ్.
నాస్తి భార్యా సమోబంధు ర్నాస్తి భార్యాసమో గతిః,
నాస్తి భార్యా సమో లోకే సహాయోధర్మ సంగ్రహే,
యస్య భార్యాగృహే నాస్తి సాధ్వీ చ ప్రియవాదినీ,
అరణ్యం తేన గంతవ్యం యథారణ్యం తథా గృహమ్.
అరావప్యుచితం కార్య మాతిథ్యం గృహమాగతే॥
ఛేత్తు మప్యాగతే ఛాయాం నోపసంసారతే ద్రుమః"

తాయి. ఇటుకలు, సిమెంటుతో కట్టిన గోడలను ఇల్లు అని పిలువరాదు. అది కట్టడము మాత్రమే, ఆకట్టడానికి ప్రాణము పోసేది గృహస్థ వ్యవస్థ, వ్యవస్థలో కేంద్రబిందువు గృహిణి, ఇల్లాలు, గృహిణియే గృహము "గృహిణీ గృహముచ్యతే" అన్న అభియుక్తోక్తి వ్యాసునిదే గృహిణిలేని ఇల్లు ఒడవితో సమానము. గృహిణి నిర్వహించవలసిన ప్రధానధర్మాలలో, ఒకటి ఆతిథ్యాన్ని ఇవ్వడము. హిమాలయా ప్రాంతారణ్యంలో నెమళ్లు, గుంపులు గుంపులుగా తిరిగే గౌరీ శిఖరం మీద, ముక్కు మూసుకొని తపస్సు చేసిన పార్వతికి గూడ ఈ ధర్మము నిర్వహించక తప్పలేదు. బ్రహ్మచారి రూపాన్ని ధరించి వచ్చిన శివునికి ఆమె ఇచ్చిన ఆతిథ్యము బహుమాన పూర్వకమయిన సపర్య, సేద దీర్చగలిగే మంచిమాట. అంతయినా చాలు. కాని ఆతిథ్యము మాత్రమివ్వాలి. గృహిణి నిర్వహించే ఈ ధర్మాన్ని, చిన్నచూపుతో చూడ రాదు. ధర్మాచరణంలో భార్యను మించిన బంధువు, భర్తకు లేడు. సాధ్వీ ప్రియంవద అయిన భార్య ఉన్న భర్త, త్రివర్గములను సాధించగలడు. అట్టి భార్య ఉంటే చెట్టు కింద గూడా సంసారము చేసేవాడు సుఖపడగలడు. అక్కడే గృహాన్ని ఏర్పరచి ఆమె ధర్మాన్ని నిర్వహించ గలదు. ఆమె లేని భవనము గూడా అరణ్య ప్రాయము.

''గృహిణీ సచివః సఖీమిథః ప్రియశిష్యాలలితే
కలావిధౌ'' అని గృహిణి వైశిష్ట్యాన్ని వర్ణిస్తారు.

గృహిణి బుద్ధిబలంతో మంచిసలహాలనిస్తుంది. మంచి సచివునిగా గృహిణి తయారు కావాలంటే ఆమెకు చాలాసంస్కారము: చదువు ఉండాలి. అప్పుడే ఆ సంసారము చక్కబడుతుంది. ఆమె స్నేహశీలి అయిఉండాలి. లలిత కళలతో ఆమెకు పరిచయముండాలి. అటువంటి గృహిణి ఉన్న ఇల్లు స్వర్గప్రాయము.

గృహస్థ ధర్మము అసిధారవ్రతము వంటిది. ఇంటికి వచ్చిన శత్రువును సైతము మర్యాదలతో సత్కరించాలి. ఇక మిత్రుని సత్కరించాలని చెప్పడము పునరుక్తమవుతుంది. చెట్టు, తనను నరకడానికి గొడ్డలిచేత బట్టి వచ్చిన వానికి గూడా నీడని ఇస్తుంది. ఈ గృహస్థ ధర్మనిర్వహణములో, చెట్లే గురువులు మానవునకు.

డబ్బు సంపాదించడమవసరమే. ధర్మార్థ కామ మోక్షాలనే నాలుగు పురుషార్థాలలో అర్థము రెండవది, అందుకే 'అర్థకరీ విద్యా' అని అన్నారు. మనమభ్యసించే విద్య గూడా, డబ్బును సంపాదించి పెట్టగలగాలి. వ్యాస భగవానుడు అర్థమును గూర్చి మంచి ఉపదేశాన్ని చేశాడు,

" అర్థేన హి విహీనస్య పురుషస్యాల్ప మేధసః
విచ్ఛిద్యంతే క్రియాఃసర్వే గ్రీష్మే కుసరితోయథా.
అధనేనార్థకామేన నార్థః శక్యోవిధిత్సితుమ్.
అర్థైరర్థా నిబధ్యంతే గజైరివ మహాగజాః
యఃకృశార్థః కృశగవః కృశభృత్యః కృశాతిథిః
సవై రాజన్ కృశోనామ న శరీర కృశః కృశః''

మందబుద్ధి, దరిద్రుడు అయిన వాడేమి సాధించగలడు? అతని ప్రయత్నములు పథకములు, ఆశలు అన్ని ఎండకాలంలో చినచిన్న వాగులవలె ఇంకిపోతాయి. డబ్బు సంపాదించడం గూడా అంత తేలికగాదు. డబ్బున్న చోటికే మరికొంత డబ్బు చేరుతుంది. డబ్బుతోనే డబ్బును ఆకర్షించవచ్చును. ఏనుగులను బంధించడానికి ఏనుగులనే గదా ఉపయోగించేది.! కృశుడు, బక్కనివాడు అని ఎవరిని అనాలి, శరీరము కృశించి ఉన్నంత మాత్రాన మనిషి బక్కవడడు,

అతడి అర్థకము పరివారము, సేవకులు, ధనకనకవస్తు వాహన సంపద, పశు సంపద కృశించి, అతని ఇంటికి అతిథులు రావడం ఆపివేస్తే. అట్టివానినే కృశించిన వాడని అంటారు. తనకే లేనివాడతిథుల నాదరించడం కష్టము, గృహస్థ ధర్మాన్ని నిర్వహించేవారు, ధర్మార్థకామములను సమంగా ఆదరించాలి. అర్థకామాలు ధర్మబద్ధములయ్యేటట్లు చూచుకోవాలి. అందుకే అర్థకామాలతో ప్రమేయము లేని మునివృత్తి కంటే, సన్యాసాశ్రమం కంటే అధ్యయనశీలమైన బ్రహ్మచర్యాశ్రమము కంటే, గృహస్థాశ్రమము గొప్ప అని, ఈ క్రింది వ్యాస సూక్తము చెబుతున్నది,

"ఆశ్రమాం స్తులయా సర్వాన్ ధృతానాహుర్మనీషిణః
ఏకతశ్చత్రయో రాజన్ గృహస్థాశ్రమ ఏకతః

భీష్ముడు, ధర్మరాజుకు చేసిన ఉపదేశమిది. అన్ని ఆశ్రమాలను తూకముచేసి, దేని బరువెక్కువ అని పరీక్షిస్తే తక్కిన మూడుఆశ్రమాలు ఒక ఎత్తు, గృహస్థాశ్రమము ఒక ఎత్తు అని తేలుతున్నది. మన మిదివరలోనే చూచినట్లు పశువులకు, పక్షులకు, సర్వభూతములకు గృహస్థు, ఆశ్రయాన్ని ఇస్తాడు కాబట్టి అతడే శ్రేష్ఠుడు.

"భృత్యాతిథిషు యో భుంక్తే భుక్తవత్సు సదా సదా
అమృతం కేవలం భుంక్తే ఇతి విద్ధి యుధిష్ఠిర"

గృహస్థధర్మాన్ని నిర్వహిస్తున్నవాడు, అతిథులకు, భృత్యులకు అన్నాన్ని పెట్టి, వారు భుజించిన తరువాత చేసే భోజనము అమృతప్రాయము. ఇట్టి అన్నాన్ని తినే వారిని విఘసాశనులు అనిఅంటారు. అన్నదానము చేసిన తృప్తి అనుభవైక వేద్యము.

'నదేవాంశోదదాత్యన్నమ్' అని సూక్తి చెప్పుతున్నది. దైవాంశ కొద్ది గానైనా లేనివాడు ఇతరులకన్నము పెట్టి సంతోషించలేడు.

గృహస్థును, ఇతర ఆశ్రమములవారు ఆశ్రయించి, జీవించు విషయాన్ని ఇక్కడ ముని సుందరంగా వర్ణించినాడు.

యథా మాతర మాశ్రిత్య సర్వే జీవంతి జంతవః
ఏవం గార్హస్థ్యమాశ్రిత్య వర్తంత ఇతరాశ్రమాః"

తల్లిని పిల్లలు ఆశ్రయించి జీవించినట్లు, గృహస్థును ఇతరులాశ్రయింతురు.

గృహస్థులెప్పుడు గృహస్థధర్మాన్ని త్యాగం చేసి, వానప్రస్థులు కావాలి. ఇదిగో సమాధానము.

గృహస్థస్తు యదాపశ్యే ద్వలీ పలిత మాత్మనః
అపత్యస్యైవ చాపత్యంవనమేవ తదాశ్రయేత్''

శరీరము మీద ముడతలు ఏర్పడి, వెంట్రుకలు నెఱసిపోతూ ఉంటే ముసలి తనము ప్రవేశించినట్లే కొంచెము జాగ్రత్త పడాలి. తన సంతానానికి సంతానము కలిగితే అంటే మనుమలు, మనుమరాండ్లు కలిగితే వారిముఖం చూసిన తరువాత ఇల్లువిడిచిపెట్టి మునివృత్తి నవలంబించి అడవికి పోవాలి. ఇంట్లో జన సమ్మర్థమూ తగ్గుతుంది. మనస్సులో చీకుచింతలూ తగ్గి, ఆయుర్దాయమూ పెరిగే అవకాశముంటుంది. చాలా సాంఘిక సమస్యలు తీరి పోతాయి. అని ఆర్యులు విశ్వసించారు.

"వయాంసి పశవశ్చైవ భూతాని చ జనాధిప
గహస్థై రేవ ధార్యంతే తస్మాచ్ఛ్రేష్ఠో గృహాశ్రమీ''

డబ్బు అవసరమే గాని, ఆడబ్బు ప్రయోజనమును మనము గ్రహించాలి. అది తానైనా దానం చేయాలిగాని, కూడబెట్టిన సొమ్ము కుడువరాదు.

"నదేయం నోపభోగ్యం చ లుబ్ధైర్యద్దుఃఖ సంచితమ్
భుజ్క్తే తదపి తచ్చాన్యో మధుహేవార్థ విన్మధు''

లోభంతో కష్టపడి ధనార్జన చేసినవారు తామనుభవించక, ఇతరులకు కివ్వకపోతే, ఆ ఫలాన్ని అన్యులనుభవిస్తారు ఇది తప్పదు. తేనెటీగ కూర్చిన తేనెను, తెట్టెను కొట్టి ఇతరులనుభవించడము. మనము చూస్తూనే ఉన్నాము గదా! భర్తృహరి సుభాషితమిక్కడ జ్ఞాపకము వస్తుంది.

"దానం భోగో నాశస్తి స్రోగతయోభవంతి విత్తస్య
యో నదదాతి నభుజ్క్తే తస్యతృతీయాగతిర్భవతి''

దానానికి మూడేమూడు గతులు, దానము, భోగము నాశము, ఎవడైతే తానుభవించక, ఇతరులకూ ఈయక ఉంటాడో అతని ధనానికి మూడవగతి అనివార్యము.

ధనము కావాలి, ఎంతకావాలి. దీనికి సమాధానం చెప్పడం కష్టము. ఎంత ఉన్నా తృప్తిలేని వాడు దరిద్రుడే. ధనాశ అగ్నిలో పోసిన ఆజ్యము వంటిది. నేయి పోసేకొలది అగ్ని భగభగమండినట్లే, ధనాన్ని కూర్చేకొలది ఆశ ఇంకా పెరుగుతూనే ఉంటుంది. మనువు చెప్పిన ఈ మాటలు అదే అర్థాన్ని బోధిస్తాయి. చూడండి.

"నజాతు కామః కామానా ముప భోగేన శామ్యతి
హవిషా కృష్ణవర్త్మేవ భూయ ఏవాభివర్ధతే''

శాంతము లేక సౌఖ్యములేనట్లే తృప్తింజెందని మనుజుడు సప్తద్వీపంబు లందు చక్కంబడునే?

"దరిద్రోయస్త్వ సంతుష్టః కృపణోయోఽ జితేంద్రియః
గణేష్వసక్తధీరీశో గుణసంగోవిపర్యయః

సంతుష్టిని పొందనివాడే దరిద్రుడు. దరిద్రుడు, రోగి, మూర్ఖుడు, ప్రవాసి (ఇల్లు విడిచి దేశసంచారం చేసేవాడు) నిత్యమూ ఇతరులనూ సేవిస్తూ కాలము గడిపేవాడు. వీరు అయిదుగురి జీవితమూ వ్యర్థమేనట. తృప్తి కావాలంటే ఇంద్రియనిగ్రహముండాలి. ఇంద్రియాలను జయించని వాడు దరిద్రుడు. కృపణుడూ కూడా, సత్వరజస్తమోగుణముల కతీతుడు ఈశ్వరుడు. అంతకన్న విపర్యయము, గుణసంగము, బంధనమునకు దారి తీస్తుంది.

"కపాలే యద్వదాపః స్యుః శ్వదృతౌ చ యథాపయః
ఆశ్రయస్థాన దోషేణ వృత్తిహీనే తథాశ్రుతమ్''

పగిలిన కుండ పెంకులో నీరెంత సేపు నిలుస్తుంది? కుక్కతోలుతో సంచీ చేసి, అందులో పాలు నిలువ ఉంచితే ఆ పాలు చెడిపోవూ? అట్లాగే సద్వర్తనము లేని మనుష్యుని విద్య గూడా నిరుపయోగమే.

"అంతరా ప్రాంతరాశం చ సాయమాశం తథైవచ
సదోపవాసీ సభవేత్ యో నభుజ్తేఽ న్తరాపునః
భార్యాం గచ్ఛన్ బ్రహ్మచారీ ఋతౌభవతి వైద్విజః

ఉపవాసమంటే పూర్తిగా అనశన వ్రతాన్ని పాటించడం కాదు. రోజుకు తిండే రెండు పూటలు భుజించడము, మధ్యలో ఏమీ తినకుండా ఉండటమే ఉప

వాసము. ఇది ఆరోగ్యానికి మూలసూత్రము. ఈ వ్రతాన్ని పాటించేవాడిని సదోపవాసి అని అంటారు. అట్లే బ్రహ్మచర్యమంటే స్త్రీతో సంగమించకుండా ఉండటము కాదు. నియమపూర్వకంగా ఋతుకాలంలో భార్యతో గావురము చేసేవాడు బ్రహ్మచారియే, మహాత్మాగాంధి ప్రవచించిన బ్రహ్మచర్యవ్రతమిదే.

శోకస్థాన సహస్రాణి భయస్థాన శతాని చ
దివసే దివసే మూఢ మావిశంతి న పండితమ్''

పిరికివాడు రోజూ ఏదో ఒక నెపంతో మానసికంగా చస్తూనే ఉంటాడు. అతనికెన్ని కారణాల వల్లనో, వల్లమాలిన శోకము కలుగుతుంటుంది. నూర్లకొలది సార్లు భయపడుతూ, వేలకొలది సార్లు దుఃఖాన్ననుభవించేవారు కార్యదీక్షతో ఏ పనైనా సాధించగలరా? కార్యవిముఖులు కావడానికెన్నో నెపాలుదొరుకుతూనే ఉంటవి. కార్యోన్ముఖులు కావడానికి ఏకాగ్రబుద్ధి ఒక్కటే కావాలి, అందుకే పండితుడు ప్రతి రోజూ వచ్చే ఈ అలజడులనంతగా పట్టించుకోడు

యథాకాష్ఠంచ కాష్ఠంచ సమేయాతాం మహోదధౌ
సమేత్యచ వ్యపేయాతాం తద్వద్భూత సమాగమః

ఒక నదీప్రవాహములో కట్టెలను, పెద్ద పెద్ద దుంగలను కొట్టి పడ వేస్తారు. ఇది రవాణా సౌకర్యానికై తీసుకునే చర్య. ఒక్కొక్కసారి తీరప్రాంతాలలో ఉండే చెట్లు వరదలలో కొట్టుకొని గూడా వస్తూఉంటాయి. ఈ దుంగలు ప్రవాహంలో కొట్టుకొని పోతూ, ఒక్కొక్కసారి ఒకదాన్ని ఒకటి ఒరుసుకుంటూ ముందుకు పోతాయి. మరొకసారి దూరంగా వెళ్ళిపోతాయి. ఈ దుంగలమీద గుర్తులు పెడితే, అవి నిర్ణీత స్థానము చేరుకున్నాక వాటిని తీసుకుంటారు. వ్యాస భగవానుడు మనుష్యుల మధ్య సంబంధము గూడా ఇట్టిదే అని అంటాడు. జీవన ప్రవాహంలో మనుష్యులొక్కొక్కసారి కలిసి ఈదుతారు. కొంత దూరము పోయిన తరువాత మళ్ళీ ఒక అలవచ్చి కొట్టివేస్తే, మళ్ళీ దూరమైపోతారు ఎవరు, ఎవరితే ఎంత సేపు కలిసి ఉంటారో చెప్పలేము.

అహన్యహని భూతాని గచ్ఛంతి హి యమాలయమ్
శేషాః స్థావరమిచ్ఛంతి కిమాశ్చర్యమతః పరమ్

అరణ్యపర్వములో యక్షప్రశ్నల భాగము ప్రసిద్ధము. యక్షుడొకడు సరోవరము దగ్గర ఉండి, తన ప్రశ్నలకు సమాధానమిచ్చిన వారే నీటి తాగవలె నని ఆంక్ష పెడతాడు. అతని మాటను మన్నించని భీమార్జున నకుల సహదేవులు నీరుత్రాగి మరణిస్తారు ధర్మరాజొక్కడే దప్పికతో ఉండి గూడా నిగ్రహించు కొని యక్షుని ప్రశ్నల కొక్కొక్కదానికిసమాధానమిస్తాడు.యక్షుడు అన్నింటికన్నా ఆశ్చర్యకరమైనదేమి అని ప్రశ్నించగా ధర్మరాజు చెప్పిన సమాధానమే పై శ్లోకము. ప్రతిరోజూ మనుష్యులు మరణించడము, యమపురికి ప్రయాణం కట్టడం మనము చూస్తూనే ఉన్నాము. అయినా మిగిలిన వారంతా తామిక్కడనే స్థావరాన్ని ఏర్పరచు కున్నామన్న భ్రమలో ఉండిపోతాము. ఇంతకన్నా ఆశ్చర్య మేమున్నది? ఈ యక్షుడెవరోకాదు స్వయంగా యమధర్మరాజే. యమధర్మరాజు ప్రాచీన సాహిత్యంలో జ్ఞానానికి ప్రతీక. కఠోపనిషత్తు, సావిత్రి కథ, యక్ష ప్రశ్నలు ఈ విషయాన్నే తెలుపుతున్నాయి

'మారుతోదకవేగేన యే నమంత్యున్నమంతి చ,
ఓషధ్యః పాదపా గుల్మా న తే యాంతి పరాభవమ్
ఏవయేవ యదా విద్వాన్మన్యతేఽతి బలం రిపుమ్
సంశ్రయేత్ వైతసీం వృత్తిమేతత్ ప్రజ్ఞాన లక్షణమ్.'

ఓషదులు, చెట్లు, పొదలు, నదీతీరప్రాంతాలలో పెరిగేవి ఎప్పుడూ, నీటి దెబ్బకు, గాలివేగానికి గురిఅవుతూనే ఉంటాయి. అందులో గాలి వేగంగా వీచి నప్పుడు ఒంగిపోయే వనస్పతులు వేతసీలతలవంటివి విరిగిపోవు. వాటికి పరాభవ మనేది ఉండదు. అదే విధంగా తనకంటే బలాధికుడైన శత్రువుతో తల పడి నప్పుడు విద్వాంసుడు వెనకకు తగ్గడము భావ్యమను కుంటాడు. ఇది వైతసీ వృత్తి,

"సర్వే క్షయాంతా నిచయా పతనాంతాః సముచ్ఛ్రయాః,
సంయోగా విప్రయోగాంతాః మరణాంతం హి జీవితమ్"

లోకులు ధన సంచయాన్ని చేస్తారు. దీని పర్యవసానమేమి? క్షయమే. పెరిగినదంతా విరగక తప్పదు. సంయోగాలుఅన్నీ, విప్రయోగములో, అంటే వియోగములోనే ముగుస్తాయి. జీవితము మరణముతో అంతమవుతుంది. ఇంక దేన్ని చూసి ఇంత అభిమానము. అక్క,

'మృదునైవ మృదుం హంతి మృదునాహంతి దారుణమ్,
నాసాధ్యం మృదునా కించిత్ తస్మాత్ తీక్ష్ణతరం మృదుః.'

కఠినాత్ముని సమీపించడానికి లోకులు భయపడతారు. అదే మెత్తనివాడు మృదువర్తనుని లొంగదీయగలడు. తీక్ష్ణవర్తనులు గూడా మృదుభాషిని కాదన లేరు. అతనిమాటలకు తప్పక లొంగిపోతారు. మృదువర్తనునికి అసాధ్యమయిన దేదీలేదు. కాబట్టి మృదువర్తనుడే తీక్ష్ణతరుడు.

'షడేతాన్ పురుషో జహ్యాత్ భిన్నాం నావమివార్ణవే
అప్రవక్తార మాచార్యమనధీయాన మృత్విజమ్.
అరక్షితారం రాజానం భార్యాం చాప్రియవాదినీమ్.
గ్రామ కామం చ గోపాలం వనకామం చ నాపితమ్.'

ప్రవచనము చేయని ఆచార్యుడు వ్యర్థుడు. అధ్యయనము కొనసాగించని ఋత్విజుడు, ప్రజలను రక్షించలేనిరాజు, ప్రియవాదిని కాని భార్య, అడవిలో పశువులను కాయవలసినదిపోయి గ్రామము చేరుకోవాలనుకొనే గొల్లవాడు, ఊరువదలి అడవిలో దుకాణము పెట్టాలనుకునే కొండమంగలీ వీరందరూ వ్యర్థులు బుద్ధిమంతుడు వీరినందరినీ సముద్రమధ్యంలో చిల్లిపడిననౌకను వదలివేసినట్లు వదలిపెట్టాలి. వీరివల్లసంఘానికి ప్రయోజనముండదు.

'ఆశాం మహత్తరాం మన్యే పర్వతాదపి సద్రుమాత్,
ఆకాశాదపి వా రాజన్నప్రమేయైవ వా పునః.'

చెట్లు చేమలతో నిండిపోయిన పర్వతము చాలాపెద్దది. దాన్ని మనము చూపుతో కొలువజాలము. ఆకాశము గూడా నంతే వీనన్నింటికంటే ఆశచాలా పెద్దది, అనంతమూ అప్రమేయమయినది కొలుచుటకు వీలులేనిదది.

'భక్ష్యార్థం క్రీడనార్థం చ నరా వాంఛంతి పక్షిణః,
తృతీయా నాస్తి సంయోగో వధ బంధాదృతే క్షమః.'

పక్షులపైన మనుష్యులకు కొంత మోజుఉంటుంది. వాటిని పంజరములోనో, వాకిట్లోనో బంధించి ఉంచడమొక నాగరకత, కాలక్షేపానికి పనికి వచ్చేదది. లేకపోతే పక్షులను చంపితింటారు మూడవప్రయోజనము వాటివల్లలేదు.

'బకవచ్చింతయే దర్థాన్ సింహవచ్చ పరాక్రమేత్,
వృకవచ్చావలుంపేత శరవచ్చ వినిష్పతేత్.'

కార్యదక్షుడు కుశాగ్రబుద్ధియై, మనోబలాన్ని శరీరబలంతో జోడించాలి. అతడు కొంగ కండ్లు మూసుకొని ధ్యానము చేసినట్లు ఏకాగ్రబుద్ధితో వివిధ సమస్యలను గురించి ధ్యానము చేయాలి. ఇది ఒక ధ్యానము దీనికి వ్యంగ్యార్థము చెప్పరాదు. సింహము వలె పరాక్రమాన్ని ప్రదర్శించాలి. తోడేలు వలె పొంచి ఉండి శత్రువుమీద హఠాత్తుగా పడాలి. బాణము వలె దూసుకొని ముందుకు పోవాలి హనుమంతుని సముద్రలంఘనాన్ని వర్ణిస్తూ వాల్మీకి మహాముని అతనిని, 'జ్యాముక్త ఇవనారాచః,' అని వర్ణించెను.

'యోఽరిణా సహ సంధాయ సుఖం స్వపితి విశ్వసన్,
స వృక్షాగ్రే ప్రసుప్తో వా పతితః ప్రతిబుధ్య'తే.'

చెట్టు కొమ్మమీద ఒళ్ళు మరచి నిద్రించేవాడు, ఎప్పుడు క్రిందపడేది తెలియదు. క్రిందపడినతరువాతనే అతడు మేల్కొంటాడు. అట్లే శత్రువుతో సంధి చేసుకొని ఏమరుపాటుతో ఉన్నవాడు సర్వనాశనమయిన తరువాతనే కండ్లు తెరచును.

'మితం దదాతి హి పితా మితం భ్రాతా మితం సుతః,
అమితస్య హి దాతారం భర్తారం కా న పూజాయేత్,

స్త్రీకి చిన్నతనములో తండ్రి సోదరులు, ఆ తరువాత భర్త, వృద్ధాప్యములో కొడుకులు రక్షకులవుతారు. అందరూ మితంగానే కొద్దికొద్దిగా ఆమెకు సహాయపడేవారే. భర్త ఒక్కడే అమితమయిన సుఖాన్ని రక్షణను, ధనాన్ని, మానమర్యాదలను స్త్రీకి కల్పించగలడు. అట్టిభర్తను ఏ స్త్రీ పూజించదు? ఈ సుభాషితము వాల్మీకి ప్రోక్తము గూడా.

'యచ్చ కామసుఖంలోకే యచ్చదివ్యం మహత్సుఖం,
తృష్ణాక్షయ సుఖస్యైతే నార్హతః షోడశీం కలామ్.'

మనము కోరుకున్న కోరిక తీరితే కలిగేసుఖము, మానవాతీత శక్తులను సాధించడం వల్ల కలిగే దివ్యసుఖము తాత్కాలికములు తృష్ణచల్లారడం వల్ల

కలిగే సుఖములో షోడశకళ కూడా వీటికి సాటిరాదు. కోరికలను క్షీణింపజేసుకోవడంలోనే నిజమయిన సుఖమున్నది.

'దాంతస్య కిమరణ్యేన తథాఽదాంతస్య భారత,
యత్రైవ నివసేద్ దాంత స్తదరణ్యం తథాశ్రమః'

అరణ్యనివాసము ఎందుకు చేయాలి. ఇంద్రియనిగ్రహాన్ని సాధించడం కొరకు గదా! దాంతునకు (దమముగలవానికి) అరణ్య నివాసమెందులకు? తనను తానదుపులో ఉంచుకోలేని వానికి గూడా అరణ్య వాసము వల్ల ప్రయోజనము లేదు. దాంతుడున్న స్థానమే అరణ్యమువలె, ఆశ్రమమువలె ప్రశాంతముగా ఉంటుంది.

తపః పరం కృతయుగే త్రేతాయాం జ్ఞాన ముత్తమమ్.
ద్వాపరే యజ్ఞమే వాహు ర్దానమేకం కలౌయుగే.'

యుగధర్మాలు భిన్నభిన్నంగా ఉంటాయి. కృతయుగంలో తపస్సు చేసిన వానికే ఫలముంటుంది. త్రేతాయుగంలో జ్ఞానము ప్రధానము. ద్వాపరయుగములో యజ్ఞము చేయడమే ధర్మము. కలియుగములో మాత్రము దానముచేయడమే పరమధర్మము.

'శ్వః కార్యమద్య కుర్వీత పూర్వాహ్ణే చా పరాహ్ణికమ్,
న హి ప్రతీక్షతే మృత్యుః కృతమస్య న వా కృతమ్.'

రేపటి పనిని నేడు ముగించుకోవాలి. పగటి పూట చేసే పనిని పొద్దుటనే ముగించుకోవాలి. మీరు పనిని ముగించుకున్నారా! లేదా! అని మృత్యువు ఎదురు చూడదు కదా! కబీర్ సూక్తి ఇక్కడ అందరకు జ్ఞాపకము వచ్చేదే.

'కాల్ కరై సో ఆజ్ కర్ ఆజ్ కరై సో అబ్,
పల్ మే పరలై హోయ్‌గా బహురి కరేగా కబ్.'

'ఆదిత్యచంద్రావనిలానలౌచ, ద్యౌర్భూమిరాపో హృదయం యమశ్చ.
అహశ్చరాత్రిశ్చ ఉభేచ సంధ్యే, ధర్మశ్చజానాతి నరేంద్ర వృత్తమ్.'

మనము రహస్యంగా ఎవరికి తెలియకుండా పాపకార్యాలను చేస్తున్నామని తృప్తిపడరాదు. మానవుడి ప్రతికదలికకును సూర్యచంద్రులు, పంచభూతములు అంతః కరణము, యముడు, పగలు, రాత్రి, ప్రాతః సంధ్య, సాయం

సంథ్య, ధర్మము ఇవన్నీ నరుని వర్తనాన్ని ఎప్పటికప్పుడు గమనిస్తూనే ఉంటాయి కాబట్టి జాగ్రత్తగా ఉండాలి.

భారతేతిహాసాన్ని రాజనీతికోశంగా భావిస్తారు. దిజ్మాత్రంగా ఇక్కడ ఉదహరణలు చూపిస్తాను.

''దండశ్చేన్న భవేల్లోకే వినశ్యేయురిమాః ప్రజాః
జలే మత్స్యాని వాభక్ష్యన్ దుర్బలాన్ బలవత్తరాః

మత్స్యన్యాయమని ఒకటున్నది. పెద్దచేప,చిన్నచేపను మింగివేస్తూఉంటుంది సంఘవ్యవస్థ గూడా ఇట్టిదే. బలవంతులు దుర్బలులను మింగివేస్తూ ఉంటారు. ఈ దురాక్రమణ, దుర్మార్గవర్తనము కొంతవరకైనా తగ్గాలంటే దండము, రాజ్యాంగము ఉండాలి. ప్రభుత్వము దుర్బలుల కొఱకే, బలవంతులు తమ మంచి చెడ్డలను తామే చూసుకోగలరు.

"ఆదాయ బలిషడ్భాగం యో రాష్ట్రం నాభిరక్షతి,
ప్రతి గృహ్ణాతి తత్పాపం చతుర్థాంశేన భూమిపః''

రాజధర్మాన్ని నిర్వహించడం చాలా కష్టము. చూసేవారికి రాజు నీడలో నడుస్తున్నట్లే ఉంటుంది కాని నిజంగా రాజుకు, తాను నీడలోనకిచిన చల్లదనం కన్నా, గొడుగుమోతబరువే ఎక్కువ ఒకవేళ మోస్తే కష్టాన్ని కలిగిస్తుంది. సనాతన ధర్మవ్యవస్థలో సంఘములోని వ్యక్తులు, తమ ఆదాయములోని ఆరవ భాగాన్ని రాజుకు కప్పంగా చెల్లించేవారు. ఇది మనువుశాసనము దీన్నే కాళిదాసాదులు కూడా తమ ఆదర్శనాయక ప్రభువుల వర్ణనలో ఇమిడ్చిరి. ఈ కప్పాన్ని రాజుకు ఎందుకు చెల్లించాలి? రాజు రాష్ట్రాన్ని రక్షించాలి గనుక, ఒకవేళ రాజు తన ధర్మనిర్వహణలో ఓడిపోతే, వచ్చేపాపములో ఆరవవంతు గాదు, నాల్గవవంతు చక్రవడ్డీతో రాజుకు చుట్టుకుంటుంది.

"ఏకం హత్వా యదికులే శిష్టానాం స్యాదనామయం,
కులం హత్వా చ రాష్ట్రం చ న తద్వృత్తోపఘాతకమ్."

"దేశద్రోహి తల్లి" అని ఒక ఆంగ్ల కథ ఉన్నది. తన కొడుకు శత్రు సైన్యంతో చేతుకలిపి అర్థరాత్రి ఇనుపవంతెన వేసి, శత్రు సైన్యం నదిని దాటి తన ఊరు మీదపడి నాశనం చేయడానికి పథకము వేస్తున్నాడని ఆ తల్లికి తెలు

స్తుంది తన కార్యక్రమాన్ని ప్రారంభించేముందా ముద్దులకొడుకు అన్నము తిన డానికి ఇంటికి వస్తాడు. తన వారి నంతా రక్షించడము, కులము యొక్క విశాల శ్రేయస్సును కోరడము, కొడుకు ప్రాణాలకంటె తీయగా అనిపించినది ఆ తల్లికి. వెంటనే ఆమె, కొడుకును హత్యచేసి కులాన్ని రక్షిస్తుంది. పై భారత శ్లోకమా ధర్మాన్నే బోధిస్తుంది. ఒకడిని చంపడం వల్ల, కులంలోమిగిలిన వారికి రక్షణ ఏర్పడేట్లయితే అది కర్త శీలానికి మచ్చరానివ్వదు.

"న హి సత్యాద్ఋతే కించిద్ రాజ్ఞాం వై సిద్ధికారకమ్,
సత్యే హి రాజా నిరతః ప్రేత్య చేహ చ నందతి."

రాజనీతి కుటిలంగా ఉంటుందని అంటారు. కాని శాశ్వతంగా రాజు మంచి పేరు సంపాదించాలంటే, ఇహపరాలను సాధించాలంటే సత్యమొక్కటే అతనికి ఆధారము. కుటిల నీతి ననుసరించినరాజు ప్రజలను వంచించడమేగాక, తనను తాను వంచించుకున్నవాడౌతాడు.

"భవితవ్యం సదా రాజ్ఞా గర్భిణీ సహధర్మిణా
కారణం చ మహారాజ శృణు యేనేద మిష్యతే
యథా హి గర్భిణీ హిత్వా స్వం ప్రియం మనసోఽనుగమ్
గర్భస్య హితమాదత్తే తథా రాజ్ఞాప్యసంశయమ్'',

రాజు గర్భిణి వంటివాడు ఏమి సామ్యము? కాదు! కాదు! ఈ సామ్యము ఎంతో అర్థనిర్భరము. గర్భిణికి లోకంలో అందరికంటే, చివరకు తన ప్రియ వల్లభునికంటే గర్భరక్షణమే ముఖ్యము. గర్భము హితమునే ఆమె చేకూర్చు కుంటుంది. అట్లే రాజుకు అందరికన్నా, అన్ని సమస్యలకన్నా రాష్ట్రహితము, శ్రేయస్సు ఇదే ప్రధానము.

"న విశ్వసేచ్చ నృపతి ర్నచాత్యర్థం న విశ్వసేత్,
షాడ్గుణ్య గుణదోషాంశ్చ నిత్యాంబుద్ధ్వావ లోకయేత్.''

సంధి, విగ్రహము, యానము, ఆసనము, ద్వైధీభావము, సమాశ్రయము అనే ఈ ఆరు రాజ్యాంగాలలో, గుణదోషాలను రాజు బాగావిచారించి, అడుగు ముందరకు వెయ్యాలి. ఎవ్వరినీ అతిగా అనుమానించనూరాదు. విశ్వసించనూ రాదు. ఇది సూక్ష్మాతి సూక్ష్మధర్మము. సమర్థుడయిన ప్రభువుకు, విద్య వివేకము

ఇంద్రియనిగ్రహము, (కామక్రోధ లోభాదుల నిగ్రహము) వృద్ధులపై గౌరవము వ్యవహారదక్షత, చిరునవ్వుతో ఇతరుల నెదుర్కొని పలకరించే స్వభావము ఇట్లాంటి సద్గుణాలెన్నో ఉండి, మోక్షేచ్ఛ గూడా ఉండాలి. అప్పుడే స్వార్థమును జయించగలుగుతారు సాత్త్వికులు. రాజులు కాదగినవారు.

ఎవరి పరిపాలనలో ప్రజలు నిర్భయంగా, తమ తండ్రి నీడలో జీవించినట్లు జీవించిగలరో అతడే సమర్థుడయినరాజు.

రాజును ఎన్నుకునేటప్పుడు జాగ్రత్తగా ఉండాలి. రాజు సమర్థుడయితేనే ప్రజల ప్రాణమానధన రక్షణ జరుగుతుంది; చూడండి;

"రాజానం ప్రథమం విందేత్ తతో భార్యాం తతో ధనమ్,
రాజన్యసతిలోకేఽస్మిన్కుతో భార్యాకుతో ధనమ్."

మంచిరాజును ఎన్నుకున్న తరువాత, చక్కనిచుక్క, ఇల్లాలుగా వెదుక్కోవాలి, ధనాన్ని సంపాదించాలి. రాజు దద్దమ్మఅయితే నీ భార్యకు, ధనానికి రక్షణ కల్పించేవాడెవడు?

"అరాజకేషు రాష్ట్రేషు ధర్మో న వ్యవతిష్ఠతే
పరస్పరం చ ఖాదంతి సర్వథా ధిగరాజకమ్".

అరాజకము వ్యాపించిన రాష్ట్రాలలో, ధర్మానికి నిలువ నీడ ఉండదు. మనుష్యులొకరి నొకరు పీక్కొని తినడానికి కూడా సిద్ధపడతారు. అరాజకానికి ధిక్కారము.

"ఆత్మా జేయః సదా రాజ్ఞా తతో జేయాశ్చ శత్రవః
అజితాత్మా నరపతి ర్విజయేత కథం రిపూన్."

కామక్రోధాదులకు ఉత్పత్తిస్థానము మనస్సు. అటువంటి మనస్సును నిగ్రహించు కోవడమే గొప్ప విజయము. ఈ అంతః శత్రువులను జయించిన రాజే, బాహ్య శత్రువులను తేలికగా నిర్జించగిలుగుతాడు. తనను తానదుపులో ఉంచుకోలేనివాడు శత్రువుల నెట్లు అదుపులో ఉంచగలిగేది?

"రాజ్ఞా సప్తైవ రక్ష్యాణి తాని చైవ నిబోధ మే,
ఆత్మామాత్యాశ్చ కోశాశ్చ దండో మిత్రాణి చైవ హి
తథా జనపదాశ్చైవ పురం చ కురునందన
ఏతత్ సప్తాత్మకం రాజ్యం పరిపాల్యం ప్రయత్నతః"

రాజ్యానికి సప్తాంగాలు ఉన్నాయి. అవి :- రాజు, మంత్రులు, కోశము, దండము, మిత్రులు, పురము, జనపదములు అనేవి. వీనిని రాజు జాగ్రత్తగా రక్షించాలి.

"కాలో వా కారణం రాజ్ఞః రాజా వా కాలకారణమ్
ఇతి తే సంశయో మాభూ ద్రాజా కాలస్య కారణమ్ ''

కరువు, కాలమూ అంటారు. బాగాపంటలు పండి, జననష్టము, ఉత్పాతాలు కాకుండా ఉంటే కాలము బాగుంది, రాజు మంచివాడు అని లోకులు రాజేకాలానికి (కరువుకుగూడా) కారణమని అంటారు. ఇది నిజమా, లేక కాలములో వచ్చే మార్పులు రాజు మంచిచెడ్డలకు కారణమా అనే సందేహమక్కరలేదు. రాజే కాలానికి కారణము.

"దోగ్ధ్రీ ధాన్యం హిరణ్యం చ మహీరాజ్ఞా సురక్షితా
నిత్యం స్వేభ్యః పరేభ్యశ్చ తృప్తా మాతా యథాపయః''

"ధర్మోరక్షతిరక్షితః (ధర్మాన్ని నీవు రక్షిస్తే, నిన్ను ధర్మము రక్షిస్తుంది). అని నీతివాక్యమున్నది ఇక్కడ బాదరాయణుడు మహీరక్షతి రక్షితా, అని అంటున్నారు. భూమి గోవువంటిది. గోశబ్దానికి భూమి అని కూడా అర్థమున్నది. గొల్లవాడు గోవును. గోష్టాన్ని శుభ్రంగా ఉంచి, పుష్టికరమయిన గ్రాసాన్ని పెట్టి, దూడను కాపాడితే తృప్తితో ఆ గోమాత కడివెడుపాలనిపిస్తుంది. అదే రీతిన, అంతఃశత్రువుల బారినుండి, బాహ్యశత్రువుల బారినుండి భూమాతను రక్షిస్తే ఆనందంతో, ఆ తల్లి స్తన్యాన్ని చేపినట్లు ధాన్యాన్ని, హిరణ్యాన్ని, రాజుకు ఇస్తుంది. అయితే దూడను కాపాడినట్లు, రాజు ప్రజలను గూడా కాపాడాలి అప్పుడే భూమాత తృప్తినొందేది. భూమంటే ఎవరనుకున్నారు. ఏమనుకుని మీ ఇష్టము వచ్చినట్లు త్రవ్వి ఆమెను హింసిస్తున్నారు.? ఏ ధైర్యంతో, కాలితో ఆమెను తన్నుతూ అడుగు వేస్తున్నారు. ఆర్యసూక్తి ఏమంటుందో చూద్దాము,

"సముద్రరశనే దేవి పర్వత స్తనమండలే!
విష్ణుపత్ని నమస్తుభ్యం పాదస్పర్శం క్షమస్వ మే.'

సముద్రము ఒడ్డాణంగా పర్వతాలు స్తనాలుగా ఏర్పడ్డ విష్ణుపత్నీ! భూమాతా! నీకు నమస్కారము. నేను పాదాలతో నిన్ను స్పృశించక తప్పదు. క్షమించగలవు.

"యమాశ్రిత్య నరా రాజన్ వర్తయేయుర్యథాసుఖమ్
అనాథాస్త్రప్యమానాశ్చ దస్యుభిః పరిపీడితాః
స్వబాంధవ మివ ప్రీత్యా పూజయేయుస్తమేవతే'

ఏ రాజు నాశ్రయించి ప్రజలు రక్షణను పొందుతారో, ఆ రాజు వారికి నిజమైన బంధువు. అతని పాలనలో అనాథలు, దుఃఖితులు, దస్యువులచేత పీడింపబడే వారు సుఖపడగలిగితే వారికతడు ఆత్మబంధువే అవుతాడు. అట్టిరాజును వారెందుకు పూజించరు?

కులీనః శీలసంపన్నో వాగ్మీ దక్షః ప్రియంవదః
యథోక్తవాదీ స్మృతిమాన్ దూతః స్యాత్ సప్తభిర్గుణైః

దూత లక్షణాలనువర్ణించే శ్లోకమిది దూత కులీనుడు. శీలసంపన్నుడు, వక్త, దక్షుడు. ప్రియంగా మాట్లాడేవాడు, ఉన్నదున్నట్లు చెప్పేవాడు, జ్ఞాపకశక్తి బాగా ఉన్నవాడు అయి ఉండాలి. అప్పుడే దౌత్యధర్మాన్ని అతడు నిర్వహించ గలడు.

ప్రాచీన భారతదేశంలో గణతంత్రరాజ్యాలు నెలకొన్నవి. ఇవి చిన్న చిన్న రిపబ్లిక్ రాజ్యాలు. ఇవి ఏ విధంగా పనిచేస్తాయి, అని ధర్మరాజు భీష్మ పితామహుని ప్రశ్నిస్తాడు.

గణానాం వృత్తిమిచ్ఛామి శ్రోతుం మతిమతాంవర
యథాగణాః ప్రవర్ధంతే నభిద్యంతే చ భారత,
అరీంశ్చ విజిగీషంతే సుహృదః ప్రాప్నువంతి చ,

ఈ గణములెట్లు అభివృద్ధిచెందుతాయి. వీటిలో చీలికలు రాకుండా చేయడమెట్లు? ఏ విధంగా వీరు శత్రువులను జయించగోరుతారు. వీరు మిత్రులను ఏర్పరచుకునే విధానమేది? దీనికి భీష్ముని సమధానమిది. చాలామంది విచార విమర్శలు చేస్తారు. గాబట్టి ఏ నిర్ణయమూ తొందరగా తీసుకోవడానికి వీలుండదు, ఆయా సభ్యుల లోభమోహములు, స్వార్థపరాయణత అసహనము, మితిమీరి వ్యయము చేయడము, ఒకరి తప్పను మరొకరు వెదకుతూ ఉండడం, గణ వ్యవస్థకు హానికరాలవుతవి. వారికి ఐకమత్యమవసరము ఐకమత్యమున్నచోట

ధనసంపత్తి ఒనకూడుతుంది. బాహ్యారాజ్యముల వారు, వీరితో మైత్రిని కాంక్షిస్తారు గణాలలో గూడా పరస్పర సహాయ సహకారాలు అభివృద్ధి చెందుతవి. సదవగాహన ఏర్పడుతుంది.

"తస్మాన్ సంఘాతమే వాహ్యర్గణానాం శరణం మహత్"

గణములు వర్ధిల్లాలంటే వారు ఐకమత్యంగా ఉండటమొక్కటే మార్గము

ఇదీ సంగ్రహాతి సంగ్రహంగా వ్యాససూక్తము ఇందులో ఏ కొద్ది జ్ఞానము కలిగినా జీవితాన్ని సరిదిద్దుకొనవచ్చును. ఎన్నోరకాల మనస్తత్వాలున్న వారికి, ఎన్నోరకాల ఉపదేశాల నిచ్చిన బ్రాహ్మీమూర్తి వ్యాసుడు. వ్యాసుని సుభాషితాలను చదివిన వారికి కలిగే అనుభూతి ఎటువంటిదో వ్యాసుని వల్లనే తెలుసుకుందాము.

"భిద్యతే హృదయగ్రంధిః ఛిద్యంతే సర్వసంశయాః
క్షీయంతే చాస్యకర్మాణి మయిదృష్టేఖిలాత్మని"

భగవంతుని దర్శనభాగ్యము కలిగిన భక్తుని హృదయగ్రంథి, ముడి భేదింపబడుతుంది. తెగిపోతుంది. అన్నిసంశయాలు నివృత్తిని పొందుతాయి. కర్మబంధము క్షీణించి నశిస్తుంది. వ్యాస భారతి సాక్షాత్కారమయితే కూడా ఇదే స్థితిలో సాధకుడుంటాడు:

"నమోఽస్తుతే వ్యాస విశాలబుద్ధే ఫుల్లారవిందాయత పత్రనేత్ర,
యేన త్వయా భారతతైల పూర్ణః ప్రజ్వాలితో జ్ఞానమయ ప్రదీపః"

ఇక్కడ ఒక భక్తుని మనోనేత్రానికి వ్యాసుడు వికసించిన తామర రేకుల వంటి పెద్ద పెద్ద కండ్లతో సాక్షాత్కారించినాడు. ఆ భక్తుడు భారతాన్ని, వ్యాసుడు వెలిగించిన తైలపూర్ణ ప్రదీపంగా, జ్ఞానమయ ప్రదీపంగా ఊహించుకున్నాడు. విశాలబుద్ధి, విశాలనేత్రుడు, విశాల ప్రజ్ఞావంతుడూ అయిన వ్యాసునకు నమోవాకములు. శత సహస్ర ప్రణామములు.

"వ్యాస సూక్తమిదం రమ్యం వ్యాహృతం హ్యల్పమేధయా,
యత్కించి దేహీయతేఽస్మిన్తు, తత్ క్షమధ్వం మహామహాః"

| పేజీ | పంక్తి | తప్పు | ఒప్పు | పేజీ | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|---|---|---|---|
| 5 | 1 | థ | ధ | 37 | 14 | దు | ది |
| 9 | 7 | ఆ | అ | 40 | 3 | ఆశా | ఆశ |
| | 20 | ఆ | అ | 44 | 13 | చే | వే |
| 11 | 1 | న | స | | 18 | ద్ద | ద్ధ |
| 11 | 8 | ఐ | ఓ | 45 | 24 | ఆ | అ |
| | 12 | ము | మ | 48 | 3 | యె | యే |
| | 10 | ఆ | అ | | 28 | వె | వే |
| | 21 | ద్వై | ద్రై | | 17 | స్తో్ర | స్తో |
| 14 | 17 | ర్చి | ర్చే | | 20 | య | యి |
| | 26 | స్త్ర | స్త్రు | | 24 | రు | డు |
| 17 | 19 | జ్రై | చ్రై | | 28 | ఇ | ఉ |
| 18 | 12 | రు | డు | 54 | 21 | వ | ప |
| 19 | 12 | ష్ఠ | ష్ఠ | | 23 | రి | రీ |
| | 18 | న్యా | స్యా | 56 | 4 | ర | రీ |
| | 19 | య్యా | మ్యా | 59 | 6 | వే | మే |
| | 24 | ్రవ | ్రత | | 13 | యో | యొ |
| 20 | 26 | దే | ద్రై | 60 | 14 | ఖా | ఖ |
| 21 | 1 | జా | జ్ఞా | 67 | 16 | నా | నో |
| 22 | 5 | ద | ధ | 70 | 17 | దు | థ |
| 25 | 19 | ద | ధ | 73 | 22 | కా | క |
| 28 | 9 | ద | ధ | 74 | 26 | తు | యి |
| 29 | 21 | పీ | నీ | 12 | 4 | గో్రగ | గో్రగ |
| 31 | 8 | న్తూ | స్తూ | | | ణము | హణము |
| 32 | 1 | ర్తైః | రైః | | 24 | దహ్యా | దహ్యా |
| | 3 | నా | న | | | నేష | మానేష |
| | 16 | కృష్ణ | కృష్ణం | 46 | 7 | రాల్చిది | రాల్చింది |
| 33 | 18 | ద | ధ | | 8 | యెసింది | మెరిసింది |
| | 24 | వ | వా | 53 | | ఉపన్యువు | ఉప |
| 35 | 6 | గ | జ | | | | మన్యువు |
| | 12 | ద్వై | ద్వై | | | | |